# పునస్సంధానశుల్కము.

సాంఘిక నాటకము.

గ్రంథకర్త

అవసరాల శేషగిరిరావు.

PUBLISHERS
MADETI SANYASAYYA & SONS.
Book Sellers, Rajahmundry.

1927

# పునస్సంధానశల్యము.

అయిదంకముల (సాంఘిక) నాటకము.

గ్రంథకర్త

అవసరాల శేషగిరి రావుగారిచే

రచియింపబడినది.



మొదటికూర్పు 1000 ప్రతులు

పబ్లిషర్సు

**మాదేటి సన్యాసయ్య& సన్సు**

ఆంధ్రాబుక్కుడిపో, రాజమహేంద్రవరము.

టైటిల్ పేజిమాత్రము శ్రీరామాప్రెస్‌నందు ముద్రితము

రాజమహేంద్రవరం.

1927

వెల రు 0—12—0

# ఈ నాటకము నందు వచ్చు పాత్రలు

## పురుషులు.

రామచంద్రరావు—రుక్మిణితండ్రి

వెంకటశాస్త్రి—రాయబారి

వెంకటేశ్వర్లు—పెండ్లికుమారునితండ్రి

శ్రీనివాసరావు—ఒక యువకుడు

నారాయణరావు—రామచంద్రరావుగారి మేనల్లుడు.

అనంతరావు—స్నేహితుడు

దామోదరుడు—ఒక యువకుడు

శ్రీరాములు—ఒక స్కూలు ఫయినలు విద్యార్థి

రామారావు—ఒక యువకుడు

సుబ్బయ్య—బడిపంతులు

సుందరం—రుక్మిణిభర్త

రఘునాథము—మధురాపురమందలి యువకుడు

## స్త్రీలు.

రుక్మిణి—కథానాయిక

విశాలక్ష్మి—రుక్మిణితల్లి

లక్ష్మీకాంతం—ఒక యువతి

కామాక్షమ్మ—వెంకటేశ్వర్లుగారి భార్య

మణిమాల—వేశ్య

శ్రీహరి—వేశ్యమాత

కృష్ణవేణి—రుక్మిణి చెల్లెలు.

# పునస్సంధాన శుల్కము

## ప్రథమాంకము.

(ప్రవేశము:— రామచంద్రరావుగారి యింటివాకిలి.)

(ప్రవేశము— రామచంద్రరావు, విశాలాక్షి, రుక్మిణి,

రుక్మి— నాన్నగారూ! నాకు నేఁడు బడియందు బహుమానముగ నీ పొత్త మొసంగినారు. (అని యొక పుస్తకమును దండ్రి కొసంగును.)

రామ— (గ్రహించి) సావిత్రీపరిణయమా! బహుమాన మెందుల కిచ్చినారు?

రు— మా బాలికాపాఠశాలయందు నేఁటి దినమున వార్షికోత్సవము జరుపఁబడినది.

రా— అగునగును. జ్ఞప్తికి వచ్చినది. నాకును నాహ్వానపత్రికను బంపియున్నారు. కాని, తీఱికకలుగలేదు. [illegible] కోలాటము, మొదలగు వినోదములు సలుపఁబడు ననియును, పిదప బహుమతు లొసంగబడుననియును బత్రికలయందు వ్రాసినారు. వానిలో నీ పాండిత్య మెందుఁగన్పట్టెను?

రు— ఎద్దియో యననేల? నేనే ప్రాధాన్యపాత్రలలో నొకతె యగు నాయిక నైతిని. అందు పాత్రపోషణ సరిగనున్న దనియు, సంగీతము, అర్థజ్ఞానము, సొంపుగ నున్న దనియు;

కొమ్మ్మ యిచ్చితిరేని [illegible] నా[illegible]

నాకు.

రా.—ఓయమ్మా! అందాక సద్యమును [illegible]

రు.—(సిగ్గు నభినయించును.)

రా.—ఏమమ్మా! సిగ్గునందుచుంటివి? ఇట్లు సిగ్గుఁజెందు[illegible] మాకు మేట్లు లభించెను? చదువుము—

—నాయనా! నీయొద్ద నాకు సిగ్గెందులకు?

ఉ. సందియమేల? సర్వగుణసంపదఁ జూడఁగ సత్యవంతుఁ [illegible]
వందితుఁ బట్టుచే యరయ భాగ్యము, భోగము సర్వసంపదా
నందముఁగూర్పవో జనక యాతని భర్తగఁ గాంచలేక [illegible]
మందును? జీవముల్ విడుచెదమార్య! నా శ్రేయమునిక్కమింతయును.

రా.—నరుఁడు సర్వవిధముల సమరినవాఁడైన [illegible] శ్రేయోదాయకమే కదా. అందులకుఁ దండ్రియేమనెనో చ[illegible] వితివా!

రు.—చదువకేమి? నారదునిచే నా సత్యవంతుఁడు పరిణయమున నొక్కవత్సరమునకు మృతినందునని తెలిసి వలదని పెక్కువిధముల నొక్కివక్కాణించెను.

రా.—పిదప...

రు.—మనమున నొకనిఁగోరి వేఱొక్కనిఁ జేపట్టఁజాల నని [illegible] మానెను.

రా.—తల్లిదండ్రులమాట జవదాటుటమాత్రము ధర్మవిరుద్ధము గాదా?

రు.—జననీజనకులు మాత్రము తమబిడ్డల ముద్దు చెల్లింపకుండుట పాడియా?

రా.—మంచిచెడ్డలు పిన్నవయస్కుల కెట్లు తెలియును?

(తెరలో) రుక్మిణీ! రుక్మిణీ!

విశా—అమ్మాయీ! ఎవ్వరో పిలుచుచున్నారు.

రు.—మా తరగతిలోని బాలికయే. (జనకుని జూచి) నాన్నగారూ! పోయివచ్చెదను.

రా—మంచిది. (రుక్మిణి నిష్క్రమించును.)

రా—(భార్యనుగాంచి) అమ్మాయి పెండ్లివిషయమై నీయభిప్రాయ మేమి?

వి—ఏమో మీయిష్టము.

రా—ఎన్నివిధముల నాలోచించినను మన నారాయణరావునకే యిచ్చిన బాగుండునని తోఁచుచున్నది.

వి—వెంకటేశ్వర్లుగారి సంబంధ మేమైనది? వారికిఁ గట్న మెంత కావలెనఁట?

రా—అధమము నాలుగువేల రొక్కమును, పుట్టెడు భూమియు నిచ్చిన నొకమాదిరిగఁ గుదురునని వర్తమాన మంపినారు.

వి—అదియే లెస్సయని తోఁచెడిని.

రా—సరి సరి. మనకున్న యాస్తియంతయుఁ జాలదు. ఇంతయు వారికర్పించి పిదప మనము చేయవలసిన దేమి? పొట్ట కెట్లో గడుపుకొందమన్నను, మిగిలిన యిద్దఱి యాడపిల్లలగతి యే మగును? వారికిఁ బెండ్లిం డ్లెట్లు చేయఁగలము?

వి—ముందుసంగతి భగవంతునిదే భారము. కట్నములు లేకపోతే కార్యములే లేవు.

గీ. కట్నమీయక వరుఁడెందుఁ గానరాఁడు
కొలఁది కట్నంబులిచ్చిన కూడు లేదు
కట్నమే సర్వవిధములఁ గన్నపుత్రి
సౌఖ్యమునఁగూర్చు మూలమూ సత్యమిదియు.

ఈరోజులలో నాఁడుబిడ్డల పెండ్లిండ్లనినఁ బ్రాణసంకటమే.

రా.—పెద్ద సంబంధములని పిట్టవీగి, యిళ్లుగుల్లలు చేసికొనుటయే కాని, వారు ధనమదాంధతచే నధికారములఁ జెలాయించుచుందురు. కార్యమగుదాఁకనే మన కుత్సాహము కాని, అయిన వెనుక బ్రదికియున్నంత కాలము విచారమే. ఏమందువా?

సీ. ముడిపడుటాఁడిగ మోమోటమియు లేక
 యధికారములఁ జూపి యదలుచుందురు
అనుకున్న కట్నముల్ యర్పణచేసిన
 లాంఛనా లిమ్మంచు లాగుచుందురు
పనిని బంపుఁడటంచు వ్రాసిన లేఖల
 మూలకీడ్చుచు ముక్కుముడిచికొందురు
శౌర్యంబుఁ జూపుచు సాటిలేరంచును
 నిరసన జేయుచు నీల్గుచుందురు

గీ. వంగివంగి సలాముల వరుసఁ జూపు
 నీచమనిపించు బ్రదుకింక నీతియగునె
 భాగ్యవంతుల యిండ్లకుఁ బరుగులిడుట
 కొఱవిఁ జేకొని తలగోకికొనుట కాదె?

ఇదియుఁగాక వారికిప్పుడు ధనముకూడెనుగాని తొల్లి నీచవృత్తులకుఁ బుట్టినిల్లని వినియుండలేదా? అట్టివారికి ధనమే ప్రాధాన్యముకాని మానాభిమానములతోను మర్యాదతోను నిమిత్తములేదు.

వి.—తొల్లిఁటి సంగతి మనకేల? పదిరాళ్ళు కలవాఁడే యీరోజుల లోఁ బలుకుబడి కలవాఁడు. భాగ్యములేకపోవుటయే పరువు, మర్యాదలు లేకపోవుట. రానురాను మర్యాదకుటుంబములు మన్నుమంటఁ గలియు, దిక్కులేని కుటుంబము లన్నియుఁ

దేజరిల్లుచున్నవి. కాయకష్టపడని బ్రాహ్మణులంతా కడకు గాళ్ళుజాపుచున్నారు. పెండ్లికుమారుడు మెడ్రాసులో జదువుచున్నాడట. ఇదియే మంచిదని నాయుద్దేశ్యము.

రా—నారాయణరావు చాల బుద్ధిమంతుడు. మేనల్లుడు కొద్దో గొప్పో చదువుకుంటున్నాడు. అదియు మనమే చెప్పించుచున్నాము. పాపము! తండ్రిలేని పిల్లవాడు. మన కున్నది వానిని జాల ప్రేమించుచుండును.

వి—వాని కాస్తి యేమున్నది?

రా—రెండుయకరముల భూమియున్నది. చాలదా? ఆ వెంకటేశ్వర్లు గారి కప్పింప నుద్దేశించినభూమి, రొక్కము యీతనికే యిచ్చి యింట నునిచికొన్న మనపిల్ల సుఖించదా?

—వాలకాలంది కట్నములిచ్చి విఱ్ఱవీగు
నట్టి బాంధవ్యమేలను యాదినుండి
యింటబెరిగెడు మేనల్లు డింటనుండ
స్వర్గముండగ నరకంబు జాలుననుట.

పై వారిని గొనివచ్చి యింటనున్న సంపదలెల్ల నర్పించినను మనకు బిడ్డకు గాపురం బొసంగుననియు నిర్ధారణ సేయజాలము. ఇదియు గాక భాగ్యభోగములు క్షణభంగురములు కదా.

సీ. కోటీశ్వరులకైన కూటికి లేకుండ
నుండెడు కాలంబు యుండవచ్చు
రాజాధిరాజైన రాజ్యమే నశియించి
యిడుములందెడు వేళ నేగుదెంచు
నిఖిలసేవకుడైనను నిమిషమాత్రంబున
ధనముచే దులతూగి తనరవచ్చు
కట్టుగుడ్డయులేని కానసవాసియు

గీ. కలిమి లేముల సంగతి కానవశమె ?
వచ్చుచును బోవుచునునుండు వరుసలేక
సాంప్రదాయము మర్యాద సానుభూతి
జూచి పరిణయ మెంచుట సొగసుకాదె?

ఇట్టి దురాశలచే నెండతెండలు తినుట కన్నమును, గట్ట గుడ్డయును లేక తహాతహా లాడుచున్నారు. వారి కెంతధనమున్నను నీచు లైన వారితో సంబంధ మొనర్చిన తుదకుఁ దలవంపులు తప్పవు.

వి.—ఈవిషయములన్నియు సత్యములైనవే కాని కాలమునుబట్టి పరివర్తించవలెను.

గీ. త్యాగభోతులజాతినుండి త్రాగకున్న
జూదరులయందుఁ జేరియు జూద మాడ
కున్న నిలువనిత్తురే యది యుత్తమంబె
యంచు హేళనసేయరె పంచనముగ?

ధర్మమైనను నధర్మమైనను దోడివారలఁ గూడకున్న నిందలకుఁ దాల దాల్పవలెను.

రా.—అతివా ! నీయుపన్యాసములు కడుశోచనీయములు. లోకులకు వెఱచి యన్యాయము లాచరించుట తగునా ? ఇప్పుడు మన రుక్మిణిని నారాయణరావున కొసంగిన వెలివేయుదురా ?

వి.—వెలివేయుదురనికాదు. చేసిననాఁటనుండియును కష్టపెట్టుదురు.

రా.—దాని యభిప్రాయమునుగూడ గనుఁగొంటివా ?

వి.—ముక్కుపచ్చలారనిది దాని కేమి తెలియును.

రా.—అట్లుకాదు. ఇంతలోనే పోయిన దేమున్నది ?

వి.—అయినఁ బిల్చెదను. రుక్మిణీ ! రుక్మిణీ ! (అని పిల్చును.)

(తెరలో)

వచ్చుచున్నానమ్మా (అని రుక్మిణి ప్రవేశించును)

రా—అమ్మా! సావిత్రీపరిణయమునుగూర్చి బాగుగ నెఱుఁగుదువుకదా. ఈపటములలో నీకునచ్చిన దేదియో చెప్పుము.
(అని రెండుపటముల నొసంగును)

రు—(సిగ్గునభినయించును)

రా—అమ్మా! సిగ్గువలదు. (అందొకదానిని జూపి)

గీ. ధనముకలవాఁ డితండును దగిన హూణ
విద్య నభ్యసించుచునుండె విలువకలదొ
(రెండవదానిని జూపి)
యితనిఁ జెప్పగనేటికి యితఁడె నీదు
భావమెఱిఁగియు మేనత్తబాలుఁ డగును.

రు—నాయనగారు! మంచిచెడ్డల మీరేయెఱుఁగుదురు.

వి—చూచితిరా! ధనవంతుఁ డెల్లఱకును బ్రియుఁడే. విద్యాబుద్ధుల నారితేరిన మన యీముద్దులబిడ్డ నెంత దగ్గఱబంధువైనను బేదవాని కిచ్చుటకు మనం బొడంబడ కున్నయది.
రుక్మిణి—(వెలవెలబారు మోమున జూచును.)

రా—తక్కిన విషయములఁ గూడ నెఱింగించెదను. అమ్మా! ఇతఁడు చాలధనవంతుఁడు. దినదినము వేనకువేలు సంబంధములు వచ్చుచున్నవఁట. ఈదినములలో నెంతటి బీదవానికైనను వరకట్నము మర్పింపక తప్పదుకదా. ఈతనికే పరిణయమొసర్చునెడఁ బుట్టెడుభూమియు, నాలుగువేల రొక్కమును నీయవలయును. ఇందు నీయభిప్రాయ మేమియో విస్తరించి చెప్పుము.

ప.—అమ్మయ్యో! అంత కట్నమే! మన కున్నయాస్తి నంతయు నీయవలసిన దేనా? తరువాత మీకుఁ దిండియో—

వి.—పసిబాలవు. అవన్నియు నీ కేల?

రు.—అమ్మా! ముందు వెనుక లారయవలదా? నాకే యింతధనము వెచ్చించిన నిఁకఁ జెల్లెళ్ళ కెట్లు పెండ్లిండ్లు సేయఁగలరు? ఇంతేకాక,

గీ. కట్నముల్ పొందువరులను గట్టుకొన్న
పాపహేతువుకావొక్కొ పరుల దేల?
బావ కేయిచ్చి నన్నును బరిణయంబు
సేయుటొప్పగుఁ దండ్రిరో చింత లేల?

బావకు న్యాయం దెంతయో ప్రేమ. నామూలమున మీఱందఱు తినఁ దిండిలేక కట్టగుడ్డ లేక పరితపించుట మాత్రము నాకుఁ శ్రేయోదా యకమా?

రా.—సరే. నీవు పోయి యాడుకొనుము.

(రుక్మిణి నిష్క్రమించును.)

వి.—ఏమైనను సరియేకాని అన్నిటికన్న నా కాసంబంధమే నచ్చి నది. శుభలేఖను బంపుఁడు. మనకుఁబ్రదాని సుఖము మనకు వలదా? సమస్తవిద్యలు నేర్చినందులకు ఫలితమేమి? మీ యిష్టము ననుసరించి యొనర్పుఁడు. నేను బనులకుఁబోవలెను.

(అని నిష్క్రమించును.)

రా.—ఎన్నివిధములఁ జెప్పినను బెడచెవిని బెట్టుచుండెనేకాని వినలే దయ్యో. ఉన్నదంతయు నల్లున కొసంగిన నిఁక గతియేమి? హా! దైవమా! మాకిఁకముం దెట్టిగతులఁ గల్పింపనుంటివో కదా. ఈకట్నములే భువి సంసారుల మ్రింగుటకే పెంచిన బ్రహ్మరాక్షసులు కాఁబోలును!

సీ. వరకట్నములఁజూడ వలదని నీతులఁ
జెప్పెడువారలే చేరి రెండు
వేవులఁబూన్చుచుఁ జేపర్ల పైనిడు
బుద్ధిమంతులై నేఁడు మూర్ఖులైరి
సంఘసంస్కరణంపు సభలఁజేసెడువారు
ముందంజవేయఁగ మొదలిడిరి యిఁక
దేశోపకారంపు దివ్య తేజంబును
శుద్ధవేదాంతులే శుంఠలైరి
గీ. కటకటా ! ధనమును జూడఁ గాలుదువ్వ
వాఁడు లేకున్న ధనకాంతి వరుఁడు నింద
లెక్కసేయఁగ నిచ్చునే నిక్క మిడియు
ధనమె మూలము జగతిని దృష్టమగును.

## రెండవ రంగము

(ప్రవేశము:—విశాలాక్షి, లక్ష్మీకాంతం.)

ల.—వదినా ! ఏమిచేస్తున్నావు ? ఎప్పుడుచూచినా యేవో యొక యాలోచనయ్యే. మాఅన్నగారు కచ్చేరికి వెళ్ళినారా యేమి ?

వి.—ఆ. ఇప్పుడే వెళ్ళినారు. ఆలోచన కేమున్నది? ఆఁడుబిడ్డలఁ గనుటే యాలోచన—

ల.—ఆవేళ కెన్నఁడోవస్తాఁడు. మన మెన్నియాలోచనలుచేసిన, బ్రహ్మవ్రాసిన వ్రాత తప్పదుకదా ! ఈపిల్లపెండ్లికే వెంగపెట్టకుంటే తక్కినవాళ్ళకో—

వి.—అదికాదే. కట్నాలుమాట వింటే కడుపు బ్రద్దలవుతోంది.

అదేమి చిత్రిమోకాని, కూటికి లేనివానికిఁగూడ కట్నా పెట్టరయే.

ల___కాలధర్మమమ్మా! ఇచ్చేవాళ్లుంటే పుచ్చుకునేవారికి నొప్పేమి? రుక్మిణికి సంబంధము కుదిరినదా?

వి___ఇంకా లేదమ్మా. దానినిగూర్చియే యిన్నియాలోచనలు.

ల.___ఎక్కడో కుదిరినట్లున్నది. నాతోఁ జెప్పకూడదా? పోనీలే. పెండ్లినాఁటైనా తెలియదా? (అని మూతి ముడుచును)

వి___నీకన్న మిత్రులెవ్వరు? ఇంకా యెక్కడామాత్రిం అనకు. ఆనఘమ నరసింహము శాస్త్రిలుగారు ప్రియత్నముచేసి కట్నమియ్యలేక యూరుకున్నారు. జ్ఞాపకమున్నదా? అదే.

ల___వారు చాలా ధనవంతులఁట. సాలుకు నాలుగైదువేలు భూములమీఁద ఆదాయము వచ్చునఁట. కొంత నిల్వయున్నదఁట. ధైర్యసాహసము లుండాలి. చేస్తే అట్టి సంబంధము చెయ్యాలి. కుట్టది సుఖపడుతుంది. పిల్లవాఁడొక్కఁడేకాఁబోలును. పిల్లకి స్వేచ్ఛ. రుక్మిణి అదృష్టవంతురాలు.

వి___అన్నీ బాగానేయున్నాయి. (అని యూరకుండును.)

ల___అడ్డేమి వచ్చినది?

వి___కట్నము మాటేనమ్మా.

ల___అన్నగా రొడంబడకున్నారా?

వి___ఒడంబడ కేమిచేస్తారు?

ల___మాఅన్నగారిని వెఱ్ఱివానినిజేసి అనినమాట చెల్లించుకుంటున్నావు. కట్న మేమాత్రిము? ఎన్నినంచులు?

వి___నాలుగువేలు రొక్కము. పైగాఁ బుట్టెడుభూమి.

ల___అబ్బో! కట్నమెంతైనా సంబంధముమంచిది. మీవారి యభిప్రాయ మేమి?

వి.—వా రిదివలదనియే చెప్పుచున్నారు. కాని చేయకతప్పదని చెప్పి నాను. ఏమందువా? పెద్దపిల్ల యిదేకదా! దీనికే ముద్దుము చ్చటలు తీరకపోతే తరువాత నేమో—

ల.—అగునమ్మా. ఏది శాశ్వతము? ఈవేళనో రేపో యేఘుడియ ం నోయెదెఱుతుమో యెవ్వరెఱుఁగుదురు? ఎప్పటిపనిదా యప్పుడు. మంచిపని చేసినావు. మీమాత్రం నరసింహశాస్త్రిల కంటే వారు వీరు చెప్పవలెనా! మీకేమిటమ్మా బోలెడు భూమి. పైగా నెలకు నూరురూపాయిల యుద్యోగం. ఈమాత్రం కట్నములేకుండా సంబంధమువచ్చునా?

వి.—అవునే. నీకండఱును మగపిల్లలే కనుక నెన్నియైనా చెప్పుతావు.

ల.—(ముసిముసినవ్వు నవ్వుచు) మాపెద్దాడి కిప్పుడు పదవయేడు. సంబంధములు వస్తున్నాయి. మేమే బురద్రిమాపుటలేదు. ఏదో యొకటి న్యాయముచేసుకోవాలి.

వి.—కట్నాలెంతెంత?

ల.—అవే యింకా తేలడంలేదు. ఓవిడా! క్రొత్తమాట విన్నా వేమిషీ?

వి.—ఏమది?

ల.—సరసమ్మగారి కుట్టుదానికిఁ గార్య మాగిపోయినదఁట!

వి.—అదేమమ్మా! ముహూర్తము దగ్గఱకు వచ్చుచున్నదని పను లు చేసుకుంటున్నారఁట కాదా?

ల.—ఈకట్నముల గొడవే. పెండ్లినాఁటి కట్నముబాపతు బాకీమిగి లినదఁట.

వి.—రామ రామ. ఎక్కడఁజూచినా పెండ్లింట్లు కట్నము, విడాకులు దేశమున కెట్టిదురవస్థ పట్టినదమ్మా. పాపము! సరసమ్మగా

రాన్నాఁడు పెండ్లికిచ్చిన రెండువేలరూపాయలు యింతవఱ కియ్యలేదఁట. నీకొడుకులకు నీవేమి చేసెదవు ?

ల.—సంటుకు వేళాయెనది. పోతానమ్మ.

వి.—మునసబీరాలె రావడం మానివేసినావు.

ల.—రాకేమమ్మా. ఏదోయొకపని, వెళ్లుతాను. (అనిని(ష్క్రమించును.)

(తెరపడును)

---

## మూడవ రంగము

(ప్రవేశము— రామచంద్రరావు, వెంకటావధాని.)

రా.—అయ్యా ! విశేషములేమి ? పంజా కాయా ?

వెం.—(తనలో) ధనమూలాగట కిదిగో సమయము. ఎంతో సుఖముగ బోయివచ్చినను బడరాని కష్టములం బడితినని చెప్పవలెను (ప్రకాశముగ) పంపు కాయమాటటుండ, అబ్బబ్బా ! ఏమి ప్రయాణమండి. అంతకన్న నరకయాతనమే మేలుబాబూ ! ప్రాణాలన్నీ కొంటికి వేసినది. నాజన్మలో నేనెప్పుడూ యింత కష్టపడలేదండి. పెద్దవాఁడను. మీరు వెళ్ళక తప్పదంటే మాటతీసివేయలేక బయలుదేరినాను. కాని... శివ, శివా...

రా.—అవధానులుగారూ ! మీకష్టమునకుఁ దగిన ప్రతిఫలముఁ జూపెదనులెండు. విషయమేమియో వినిపింపుఁడు. సానుకూలమగునట్లు తోఁచెనా ?

వెం.—(తనలో) అమ్మయ్యా ! ఇప్పటికి నామనసు కుదురుపడినది. (ప్రకాశముగా) నేను వెళ్ళడం కార్యానుకూలం కాకపోవడమున్నా ? కాని...డబ్బు...

రా—(విభ్రమముతో) కట్నము మునుపటికంటెను వృద్ధియైనదా?

వెం—అయినదా యంతే యాశ్చర్యమేమి బాబూ!

సీ. వరునికట్న మటుండ వారిపరుసలఁజూచి
  చుట్టాల నెనరుతో జూడవలయు
వియ్యపరాలికి వేయిరూప్యములైన
  ముచ్చటలన్ దీర్పవచ్చునేమొ
ఆడపడుచులకును నైదారువందలు
  వెచ్చింప నొకతీరు వేగవచ్చు
పెండ్లికినచ్చిన పెద్దలందఱకును
  పసుపుట్లు బహుమతుల్ తప్పకుండ

గీ. ఇన్నిరీతుల ధనమును నిచ్చుతోడ
లాగనున్నారు వీలున్న సాగవచ్చు
ధనము ముందుగఁ జూడక తగలమంచుఁ
జెప్పవచ్చితి నేనిందు శీఘ్రగతిని.

అసలు కట్నముకంటె నీకట్నము లెక్కువైనవి. వరకట్నము కాక పైగా రెండువేలైనా చూడవలెను.

రా—కట్నము ముందుగా నచ్చుటకుఁ బంపించవలెననిరా?

వెం—అచ్చుటకుఁ బంప నగత్యములేదు కాని రొక్కముఁ జేతఁబట్టి యుంచవలెను. మీవియ్యంకుఁడుగారు అబ్బబ్బా? ఏమిసాహసమండి. డబ్బుకి ప్రాణానికి లంకె. వలయునెడఁ బ్రాణమునైన వీడునేకాని ధనము వీడని మహానుభావులు. మీవలన వారికిఁ బెండ్లికాలమందు రావలసినలాంచనాలు డబ్బు డబ్బు చొప్పునసే కనుబెట్టినారు. దినదినము నెన్నినోళ్ల పెండ్లి కార్యములఁజేయించు బ్రాహ్మణునకైనా యవన్నియు జ్ఞాపకముండవు. మీరు నమ్ముఁడు నమ్మకపోవుఁడు. జాబితావ్రాసి

జాగ్రత్తచేసినారు. ఆపెండ్లి అయిదురోజులు యెట్లాయనతో వేగెదరోకాని, అయిదుయుగములవలెఁ దోచును.

శా—దానికేమిలెండు. ఇవ్వఁదలఁచిన దెప్పుడో యొకప్పు డివ్వక తప్పదు కదా !

వెం—బాబూ ! నేను మీతాతలనాఁటినుంచి మిమ్ములను బాగుగా నెఱుఁగుదును. ఎప్పుడూ యొకరి కిచ్చుటకాని, యొకరిగొన్న బుచ్చుకొని యెఱుంగరు. తొలుతనుండియు సన్నవస్త్రములకు లోటులేని మర్యాదకుటుంబము. అయ్యో ! మీ కుటుంబమునం దుండెడు వాత్సల్యముచేఁ జెప్పుచున్నాను. బాబూ ! మన కీసంబంధమువలదు. ముమ్మాటికిని వలదు. వారి దీనాఁడు ధనమునుబట్టి వచ్చిన మర్యాదకాని, ఆదినుండియు నున్నదికాదు. నాయనా! ఇప్పుడంటే యన్నియు నశించినవి కాని యింతకుముందు పిల్లనిచ్చెడువారు సాంప్రదాయము, పదిమంది కలవారగునా కాదాయని చూచెడివారు. కాని, యిదియేమిపాపము ! ధనమే ప్రాధాన్యము. సాంప్రదాయ మక్కరలేదు. పైగాఁ జూచినావు నాయనా ! మర్యాదమాటే లేదు. కుల మసలేలేదు. ఇది కాకుండా పిల్లనిచ్చువారి కోర్కెలన్ని వింటే యాశ్చర్యమే. పిల్లవాఁ డొక్కఁడేయుండవలెను. పిల్ల కాపురమునకు వెళ్లుసరికా యత్తమామలు లుండరాదు. రామ రామ ! ప్రపంచకము రీతంతయు నీరీతిని మారినది. ఎంతయో కాలమునుండి తినుటకు ముద్దలేనివారెల్ల భాగ్యవంతులగుచున్నారు. అట్టివారికి ధనముతో బాటు వినయమాది సుగుణంబు లెట్లలవడును ? ఎల్లవేళల లేమిచే బాధపడువాని కించుక తినుటకు గూడ దలవడిన సాధారణముగా—

సీ. తన కులహీనతఁ దాఁ గప్పిపుచ్చియుఁ
బెఱవారి కులములఁ బేర్లువెట్టు
నిజగుణంబులఁ దాచి నిరసన జూపుచు
సుగుణాత్ములనుజూచి సురిక్కుచుండు
తండ్రితాతలనాటి తమశీల మెంచక
మర్మిలు రంచును దూఱఁ దొడఁగు
బంధుజనులఁ జేర భయమందెడు నతండు
బంధుజనులఁ జూచి పరిహసించు

గీ. కలిమివచ్చినదాదిగఁ గనులమూసి
తనదె యధికారమంచును దానె యెల్ల
వారికిని దిక్కుగుసటంచు పల్లదముల
మీరిపల్కుచు నెల్లెడ మిట్టిపడును.

రా.—అయితే మీ యభిప్రాయమేమి ?

వెం.—క్రోధము వచ్చునేమో. అయిన నడిగితిరి కానఁ జెప్పెదను.
మీ మేనల్లునకు—

రా.—అవధానులుగారూ ! అందులకుమాత్రము నామనం బొడంబడ
కున్నది. ఎంతదగ్గిరబంధు వైనను ఆస్తి తక్కువ. ఇదికాక
తోడివా రాక్షేపణలకుఁ గడంగుదురు. ఏమి సేయనో చెప్పం
డి. ఈపెద్దపిల్ల కిట్లు పోనివ్వండి.

వెం.—(తనలో) పెద్దపిల్ల దిట్లుపోతే చిన్నపిల్ల కాలోచనయే యక్క
ఱలేదు. (ప్రకాశముగా) ఆకట్నమే యీతని కీయరాదా ?

రా.—(ఊరకుండును)

వెం.—(తనలో) రోగి కౌషధసేవ రుచించునా ? ఈపెండ్లితో పీనిపని
సరి. తరువాత రెండవపిల్లకు మేనల్లుఁడే గతియగునన్న మాట
సత్యమగును. ఈరీతిగఁ గొరలిపడెదువా రెందఱు కూటికి

లేకుండఁబోయిరి. చెప్పవలసినదేమో చెప్పితిని. కంచుకములేని దురద బచ్చలి కెందుకన్నట్లు యీనిష్ఠూర్యము నాకేల ? (ప్రకాశముగా) పంతులుగారూ ! కానింపు. మీరుమాత్రము తెలియనివారా ? వారికనేకసంబంధములు వచ్చుచున్నవి. అదే కావలసినచో త్వరపడవలెను.

గీ. కాలయాపనమైనచోఁ గట్టకడకు
వేలములఁ బాడవలయును విరివిగాను
సద్గుణాయక వెనువెంట సమ్మతింపఁ
గబురు సంపంగ శ్రీయమూ కమ్మవ్రాసి.

రా—అగునగును. అదియును సత్యమే. దయయుంచి మీ రేపోఁబు రంపు.

వెం—వారి కోరికెల కన్నిటికిని నొడంబాటేకదా.

రా—కాకున్న మీరిపోవును.

వెం—అయిన సరియే. నామాట—

రా—మీవిషయమై వేఱుగఁ జెప్పవలెనా ? ఎట్లో పిలువబట్టి ఈ సంబంధమును గుదిర్చితిరా మిమ్ములఁ బూతిగాఁగ సంతోష పెట్టెదను.

వెం—నాశక్తిసంతయు వినియోగపర్చెదను. వారు కోరిన కట్నమంతయు నిచ్చుటకు సంశయము లేదుకదా.

రా—నగదు నాలుగువేలు యిచ్చుటస్థిరమే. మనకున్నది పదియకరములు. అందులోఁ బుట్టినవేల యిచ్చివేస్తే తక్కినరెండు యకరములమీద నాలుగువేలు బదులుదొరకునా ? యని వెఱచుచున్నాను. అదియే నాసందేహము.

వెం—ఈభూమి మీపిల్లపేర వ్రాయుటయా ? లేక వరునికే వ్రాయవలెనా ? ఇదివఱకా ప్రస్తావన యేమైనవచ్చినదా ?

రా—రాలేదు. ఎట్లయినను సరియే.

వెం—అంతే. ఈరోజులలోఁ దండ్రి లక్షాధికారైనా, కొడుకు భిక్షాధికారి యగుచున్నాఁడు. అందుచేత నెట్లుండి మోసువచ్చినా పిల్లచేరనే వ్రాయుట యుచితము.

రా—వారందుల కొడంబడకున్న—

వెం—అయితే మీచిత్తము. నేరుబోయివత్తునా ?

రా—చిత్తము.

వెం—చెప్పమఱచితిని. పిల్లకలంకారముల విషయమేమిషి ?

రా—అది వారి యిష్టముతోఁ గూడుకొన్నది. మనము వక్కాణించ కూడదు.

వెం—సరి సరి. బాగున్నది. అన్నీ వారిష్టమేనా ? వారు చెప్పెడి ప్రతివిషయమునకుఁ దల లొగ్గవలసినదేనా ? చాలుఁ జాలు! ఈమాత్రం కట్నమిస్తే దీనియబ్బ సంబంధ మింకొకటి యుండును.

రా—ఆగ్రహపడక సమాధానముగనే మీయిష్టము వచ్చిన ట్లొనర్పుడు.

వెం—నాకు సెలవు.

రా—చిత్తము.    (ఇరువురు నిష్క్రమింతురు)

(తెరజారు నదును.)

వెం—(ఈనలి కరుదెంచి) ఆహా ! ధనమనిన యేమినిర్లక్ష్యముగా నున్నది. నాలుగువేలు రొక్కమా ! పుట్టెడు భూమియా ! పైగా లాంఛనములా ? ఇన్నియు సర్పించినా చోరునిభంగి వంగి వంగి మూలల దాగవలసిన దౌర్భాగ్యదశయేకదా. ఒకటి రెండేండ్లు గతించిన వెనుక నింకదావాలు, సిటీషనులు,

డిక్రీలు, టంటంలు. ఇదియేకదా బుద్ధిజాడ్యము. ప్రపంచ
ములో( గోరి తెచ్చుకొన్న చింతలుకొన్ని గాదలచి వచ్చి
నవికొన్ని. కాని చేసేటప్పు డున్న సంతోషము అనుభవించే
టప్పు డుండదు. పోనీ నాకేల? సంసారాలన్నీ యీలాగే
నశిస్తున్నాయి. గడించేవా( డొకడు గుణించేవా( డింకొ
కడు. మర్యాదట. కజ్జ, చిప్ప చేతికిచ్చిన తరువాత నింకె
క్కడి మర్యాద. అన్నీ మంటగలుస్తాయి. తానేదో పెద్ద
సంపాదిస్తున్నానని యాశ. ఈయుద్యోగాలు శాశ్వతమా?
కాలుసేతు లాడినంతవఱకు ఉద్యోగముకాని, ఒకరోజు తల
నొప్పివచ్చి ఆఫీసుకు వెళ్ళకుంటే అయ్యవారి కాపనమును
జీతం నష్టమే. ఏనాడో పెద్దలుసంపాదించిస్తే తానుదెచ్చి
నా లేకున్నా దర్జాగా పోతున్నది. నాయనగారి దర్జా
యింక ముందు తెలుస్తుంది.

గీ. [illegible] ప్రకీర్తిని యుంకెంచ వసుధ
రాక్ష ! యున్నియును గలుగ నిక్కమెన్న(
దలకుమించిన వ్యయమగు( దప్పకుండ
ఘోష దింతయు( జెప్పిన దుష్టమతిని.

(అనుచు నిష్క్రమించును.)

# పునస్సంధాన శుల్కము

## ద్వితీయాంకము.

ప్రదేశము—వెంకటేశ్వర్లుగారి గృహము

(ప్రవేశము—వెంకటేశ్వర్లు, కామాక్షమ్మ)

కా.—అబ్బాయికి సెలవు లెప్పుడిచ్చెదరు ?

వెం.—నేటితో నెల సరికదా. ఎల్లినుండియే సెలవులు ప్రారంభ మగును.

కా.—ఈశెలవులలోనైనా అత్తవారింటికిఁ బంపించెదరా ?

వెం.—(కోపదృష్టితో) నాయెదుట వారిమాట నెత్తకుము. ఎంత మోస మెంత మోసము! పెండ్లికాలమందు నాలుగువేలు రొక్కము, పుట్టెడు భూమి యిచ్చెదమని ప్రాకులాడి ప్రాకులాడి తమ పని తీఱెనుగదా యని రెండువేలు బకాయిపెట్టినవారి ముఖము చూడమని యున్నదా? ఆరెండువేలు యిచ్చిననే కాని, మనవాడి నచ్చటకుఁ బంపుటకు వీలులేదు. అవి సన్నవాని సన్నిటిని వదులుకుని యేదో బలుకుతుందనుకుంటే మొదటికే మోసము వచ్చినది. తనకు బనికిమాలిన సంబంధము దొరకినది.

కా.—హరి హరీ! నిష్కారణముగ వారి నేలదూషించెదరు. వారికున్న పదియకరములలోను ననిమిదియకరములు, పిల్లపేర

వ్రాయుటకు వీలు లేదంటే మీయిష్టానుసారము, మనవాడి పేరనే వ్రాసి, రిజష్టరీ యయిననేకాని పుస్తి ముడివేయుటకు వీలు లేదంటే రిజష్టరీచేయించి, పెండ్లిలో నెక్కడ పేలోటు వచ్చునో యని, అనుగులకు మడుగులొగ్గుచూ యింతాచేస్తే తుదకుఁ బనికిమాలిన సంబంధమైనదా? అబ్బాయి, అలక పాన్పునుండి రాకుంటే, వాడి కోరికప్రకారం రిస్టువాచీకి రెండువందలు, మోటార్‌సైకిల్‌కు ఆరువందలు, అదీ యిదీ అని యేలాగున లేదన్నా వేయిరూపాయి లిచ్చినారు. ఈపెండ్లికి మిగిలిన రెండుయెకరములు తనఖావ్రాసి రెండువేలు తెచ్చినారు. ఆరూపాయిలు రెండేండ్లలో రెండువాయిదాలస్తని యివ్వకుంటే ఆభూమి ఋణదాతలకుఁ జెల్లవలసినదేయఁట. ఇన్నివిధములఁ జేసినా యింకా వారికి మీవలన దూషణలు తప్పినవికావు. ఆమిగిలిన యిద్దరిపిల్లలకు వివాహము లెట్లు చేయుదురో తెలియదు. మీకివ్వవలసిన రెండువేలకు నోటు వ్రాసి యిచ్చిరికదా. ఇంకను వారిలో నేమియున్నది.

వెం__లోటా? అంతా లోటే. ఆనో టెందుకు నాలుక గీచుకొనుటకా? ఆభూమి మనపేరనే వ్రాయకూడదా? మిగిలినభూమి తనఖాదారే వేసుకొనును. నేనుమాత్రం తక్కువ వాఁడనా? దీనికి ముందే ప్లాను వేసియుంచానులే. ఇల్లు నాలుగువేలు కిమ్మతుంటుంది. తరువాత వాఁ డేలాగైతే మనకేమి?

కా__మంచిప్లానే.

వెం__నీనోట్లోనువ్వుగింజదాగదు. ఇంకా యెక్కడా అనకు.

కా__అగును. నిజమాడితే నిష్ఠూర్యము తప్పదు. మీరు దూషించనూవచ్చు. నేను పడనూవచ్చు. కాని, న్యాయ మెట్లున్న

ను, అబ్బాయి నొకమారు పంపించండి. తిరిగి వచ్చును.

**వెం.**—ఛీ ! ఛీ ! వాళ్లింట సడుగిడుటకు విలులేదు. ఇప్పుడే వచ్చెద నంపుము.

**కా.**—(చేయిఁ బట్టుకొని) ఎచ్చటకుఁ బోయెదరు ?

**వెం.**—వీధిలోనికిఁబోయి వచ్చెదను. ఎవ్వరో ద్వారముయొద్దఁ గేక లిడుచున్నారు.

(అని నిష్క్రమించును).

**కా.**—అక్కటా ! దేశమున కెట్టిహైన్యత సమకూడినది. కడుపున నొక్కపిల్ల జనించిన గన్నవారు చిప్పను గట్టను జూచుకొన వలసినదే కదా.

సీ. పూటకన్నములేని పురుషాళికినిగూడ
 విరివిగఁ గట్నముల్ వేలు వలయు
మాటాడనేరని మానవపశులకెల్ల
 విరివిగఁ గట్నముల్ వేలు వలయు
కట్ట గుడ్డయులేని కడుబీదలకునెల్ల
 విరివిగఁ గట్నముల్ వేలు వలయు
సాంప్రదాయములేని సన్యాసులకునైన
 విరివిగఁ గట్నముల్ వేలు వలయు
గీ. పురుషుఁడై జన్మమందిన బోల్కెఁజూచి
పాపుఁడైనను మఱి యెట్టి పండయైన
శుంఠయైనను దప్పదు శుల్కమీయఁ
గటకటా యెట్టిదుర్దశ కలిగె నేఁడు.

సగదుకట్నము లీయకున్న పాంసరినోట్లయిన దప్పవఁట. ఇఁక భూములకట్నమైన దస్తావేజులు ముందుగ రిజష్టరీ

అయిననే తప్ప ముడిపడుటయే కల్ల. అయ్యో! ఈకట్నము లమూలమున వేనకు వే లాదాయము వచ్చు సంసారము లొక్కక్షణములో మంటఁ గలియుచున్నవి. ఆర్జీయకున్న బెండ్లిండ్లగుట లేదు. అక్కటా! ఆడుపడుచులఁ గన్న తల్లిదండ్రులు కన్యాదానఫలంబు లంది గతికెక్కుటకు మాఱుగఁ బరిణయము లెట్లు చేయనగునో యని బెంగఁగొనుచున్నారు. కలికాలమున నిదియే కాఁబోలును.

గీ. వరుని కట్నమటన్నను వరుని పేరఁ
బెట్టి యమ్ముటయంచును భీతిలేదు
పాపభీతికి వెఱగందు వరుస లేదు
న్యాయమంతయు నేమూల నడఁగె నొక్కొ.

(తిరుగ వెంకటేశ్వర్లు ప్రవేశించును).

వెం—ఏమియో దీర్ఘాలోచన సేయుచున్నావు?

కా—ఆలోచన కేమున్నది. ఎప్పుడు చూచినా, వడ్డీలు, పత్రాలు లెక్కలేకాని, నగలా నాణెములా? శుభ్రమైన వస్త్రమా? మీపనులు మీకుఁ దప్పవు. నాయాలోచనల కేమి కాని, ఆ వచ్చినవా రెవ్వరు?

వెం—(చిద్విలాసముతో) శుభలేఖ వచ్చినది. నేను జెప్పలేదా? ఓసి కతోనుంటే సమయము రాకుండునా?

కా—(తత్తరపాటుతో) ఏమది? కోడలు రజస్వలైనదా?

వెం—ఆ. అదే లేఖ.

కా—ఎప్పుడు? శాంతియున్నదా?

వెం—నాలుగుదినములైనది. శాంతి లేదనియు, సాధ్యమైనంతత్వరలో శుభము జరిగించుకోవలసినదనియు వారే వ్రాసి పంపినారు.

కా—అయితే కాలయాపన సేయక ముహూర్త మేర్పాటుఁ జేయించుడు.

వెం—ఇప్పు డంతత్సరలోఁ జేయకపోతే పుట్టిమునుగునా ?

గీ. రెండువేల రొక్కముఁగాక రెండుయేండ్ల
వడ్డి సహితము నర్పించి పైగ నింక
వేయిరూప్యము లిచ్చిన వెడలనగును
గాక, కార్యంబు సేతునే కడకు వినుము.

కా—అయ్యయ్యో ! అదేమిగ్రహచారము! కార్యముఁ జేయకుండిన లోకులు నిలువనిత్తురా? ఎదిగిన బాలను బుట్టినింట నుంచుట పాడియా? ధర్మవిరుద్ధము కాదా? లోకనిందలకైన వెఱువవలదా? ధనమే పారిధాన్యమా? నీతులన్నియు నశించెనా? న్యాయాన్యాయము లడుగంటెనా?

వెం—నీకుఁ బిచ్చిపట్టినట్లున్నది. లోకు లేడ్చిననుసరే. మొత్తుకున్నను సరే. పుణ్యమే రానీ. పాపమే రానీ. న్యాయమైనను సరే. అన్యాయమైనను సరే. తలఁచినంత చేయవలసినదే.

గీ. పుణ్యపాపంబులంచును పొంచియున్న
నిందలను లెక్కసేయుచు నిలచియున్న
దయలఁజూపుచు నింటను దాగియున్న
ధనముఁగూర్పంగ వశమౌనె ధాత్రికైన.

కా—నిజమే కాని, మీకున్న ధనము చాలదా?

వెం—చాలుటకు దీనికింత యని యంతుకలదా? వందలున్నవాఁడు వేలకొఱకుఁ జూచును. వేలున్నవాఁడు లక్షలకొఱ కెత్తించును. లక్షలున్నవాఁడు కోటికి పడగెత్తవలెననును ఏమాదిరిగనో యింక పదివేలు వెనకవేసినచో మన రెండవఅబ్బాయి

కింతకు రెట్టింపు కష్టములు వచ్చును. ఎవరికి ధనాశయుం డదు. చూడుము.

"జరయు మృత్యువియు లేని జనుని క్రియ ప్రాజ్ఞుండును
ధనము విద్యయుఁ గూర్పఁ దలఁపవలయు."

అను నీతి యెఱుంగవా?

కా.—సరే మిగిలిన పాదములో...

వెం.—అది వేఱుసంగతి.

కా.—వేఱేమి? అదిమాత్రం నీతికాదా? ఇదికాక, అన్యాయార్జితము నిలుచునా?

వెం.—అన్యాయార్జితమా? ఒకరిని గొట్టి పుచ్చుకొనుట లేదుకదా?

కా.—మీతో నాకుఁ దర్కవితర్కంబు లెందులకుఁగాని, నా కొక వేళ నీకొక్క మీయఁజాలను. అయిన కార్యముఁ జేయరా?

వెం.—ఎందుల కీయవు?

కా.—ఒకవేళ నీయఁజాలకున్న...

వెం.—అయితే సున్నయే.

కా.—పాప మాబాలిక దోసమేమి?

వెం.—ఆదోసములు, వర్జములు నాకుఁ దెలియవు. ఆడపిల్లను పుట్టుటే మొదటిపాతకము. అట్టికుటుంబమున జనించుట రెం డవది.

కా.—మీ వాక్కుఁ గోడలగుట, మూఁడవది.

గీ. అబలలుంచును స్వాతంత్ర్య మసలలేదు
తొలుతఁ దలిదండ్రులందున దుదకు భర్త
యందు నిల్చునుగాదె యే యతివ బ్రదుకు
దోసమేలేక బాధింప దోసమగును.

వెం.—ఈనీతులన్నియు నాకు బోధింప నగత్యములేదు.

కా——అనురక్తిపాలసుట నెల్లునా? అకారణముగ నితరుల హింసింప భగవానుఁడు సైచునా? విద్యాబుద్ధు లార్జించు టెందులకు? చేసినపాప మన్నియు సుఖకరముగనే తోఁచును. కాని, యనుభవకాలమం దవన్నియు జ్ఞప్తికిరా దుఃఖమునకలుగును. ఈ తనువులే శాశ్వతము కాకున్నతఱి నిఁక నీధనసుఖములు శాశ్వతములగునా ?

గీ. ధనము వెంటరాదు తరలఁ దల్లిదండ్రి
లన్నదమ్ములు లేనగా నెన్నిపాట్లఁ
బడిన నేకీతి దాఁచిన పసులిడక
నిల్వనేర్చునే? దేహంబు నియమమిదియు.

వెం——నీతులు వదలి వేదాంతములు వచ్చినవా? ఇటులే పరితివారును నడిచిన నీసంపద లెవ్వరికొఱకు ? ఈభగవత్సృష్టి యెందులకు? ఈసుఖదుఃఖము లనుభవించువా రెవ్వరు? ధనమే లేకుండిన నిఁక బ్రదుకొకటి కలదా? "ధనమూలమిదంజగత్" అను నార్యోక్తి నెఱుఁగవా?

గీ. కలిమియే సర్వవిధములఁ గార్యవాది
కలిమియే బ్రదుకఁదెఱు వేకాలమందు
కలిమి కల్గినవారికిఁ గలదె చింత
కలిమి లేనట్టివారికిఁ గలదె బ్రదుకు.

శుభలేఖను గొనివచ్చినవా రెవ్వరు ?



వెం——ఒక విప్రుఁడు.

కా——వారికిఁ బ్రత్యుత్తరమిచ్చిరా?

వెం——ఇంత సేపా? అప్పుడే పంపివేసితిని.

కా——భోజనమిడి పొమ్మనకపోయిరా?

వెం——భోజనమా! చాలుఁజాలు. ఇది యొక దండుగా. సోలెడు

బియ్యం మిగులును. పోష్టులోఁ కార్డువేస్తే మూఁడవనాఁటికి
రాదా? భర్తిఖర్చులిచ్చి బ్రాహ్మణుడా పైగా వానికి
బహుమతికూడ లెనఁట. బహుమతులు పైపైనున్నవా? ఆ
వాజెమ్మ పంపడం ఈ వాజెమ్మ రావడం. ఇద్దరికీ సరి
పోయినది. ఇక్కడ దాఁచిపెట్టె ననుకున్నాఁడు కాఁబోలును.

కా॰—బహుమతు లివియే చాలునుగాని, ఒక్కపూట బ్రాహ్మణు
నకు భోజనముఁ బెట్టకూడదా?

వెం—మనమైతే యేగంజినీళ్లతోనో తింటాము. పైవాఁడు చేరితే
పప్పు, కూర, పులుసు, యివన్నికావాలి. మనకు తవ్వెడు
బియ్యమైతే మూఁడునాళ్ళకు సరిపోవును. వాఁడికొక్కపూటకు
సరిపోవు. భోజనమంటే పైఁబై నున్నదా? తెచ్చేవాళ్ళకుఁ
గష్టముకాని, యెన్ని కబుర్లయినా చెప్పవచ్చును. నే నీధన
మంతా యెంతకష్టపడి సంపాదించినానో వింటే తెలుస్తుంది.
చెప్తాను విను.

సీ. తండ్రి పోవుసరికి దమ్మిడీలేకున్న
చెంబుఁ జేతను బట్టి చేర్చినాను
కూలినాలికిఁబోయి కూటసాక్ష్యములిచ్చి
కూడైనఁ దినకుండఁ గూర్చినాను
కట్ట గుడ్డఁగొనక కర్చుగుసంచును
బ్రాతిబట్టలతోనె బ్రదికినాను
తాకట్టులనుబట్టి తబ్బిబ్బు పడకుండ
[illegible] వర్జించి యవి తస్కరించినాను
మానమభిమానమునకన్ను మసలినాను
తగిన తనవాళ్లఁ బట్టుచుఁ దరలినాను
అధికవడ్డీలసొమ్మును నధికపఱిచి
ధనముఁ గలవాఁడనైతినీ తథ్యమింత,

కా—ఓహో! చాల గష్టపడియే సంపాదించినారు. ఇంటఁ బనులఁ
జూచుకొనవలెను. పోయి వచ్చెదను.

వెం—తర్క వితర్కంబులైనవా?

కా—(ఏదియో వికట నభినయించి) ఎవ్వరో తలుపుఁ దట్టుచున్నా
రు. చూడండి.

(వెంకటేశ్వర్లు నిష్క్రమించును).

పెండ్లిండ్ల కష్టములే పెరిగి సంసారులను సన్యాసులుగ మా
ర్చుచుండఁ బైగాఁ గొత్తకష్టము లేర్పడినవే.

సీ. నవమాసములు మోసి నరకబాధనుబొంది
ఓప్పనగనుటయే యొక్కచింత
కనిన దాదిగ వారిఁ గాచుచుఁ బెంచుచు
నోసరింపఁ బెద్దగ నొక్కచింత
వయసువచ్చినవెనక వరులకై యత్నించి
యొప్పైన చోటీయ నొక్కచింత
ఖడ్గవాదము లేక కాపురంబునుగూర్పఁ
జక్క సేయుటకునై యొక్కచింత

గీ. ఉచితరీతులనుండగ నొక్కచింత
ఇన్ని చింతలు దట్టఁ జేరి మోస్సరాని
దుఃఖములఁ గూర్చుచుండును ద్రోలుఁదనుండి
ఆడుబిడ్డలఁగనుటయే యఘమమును.

ఈవిధమంతయుఁ దిలకింప [ నీకముందాడుబిడ్డ పుట్టినదనుటతోడనే
యేసుకొనటనో కలుగుటయే యుత్తమమని పరిణమించునుగాఁబోలును.
ఒకపిల్లతోనే సంసారమంతయు నాశనమగుచుండఁ దక్కినవారిగతి
యేమగును? కొందఱుబుద్ధిహీనులై ఉన్నవారికి వేలకొలఁది కట్నము
లర్పించి వారికే వంగి వంగి సలాములు చేయుచుందురు. కాని దగ్గిర

బంధువులకిచ్చుట కొండంబడకున్నవారలు. ఆకట్నమే బీదరికంబు ననున్న యేమేనల్లునకో పిల్లసహితంబుగనర్పించి యింటనునిచికొన్న నెంతయో శ్రేయోదాయకమగునుగదా. ఇంతియేకాక, లక్ష్మియే వరించియున్నచోఁ గులశీలనామంబులఁ జూడనగత్యములేదు. వరుఁడు ధనవంతుఁడైయెనచో.

సీ. కులముతక్కువయైన కొంఱగానివాఁడైన
ధనముండుటయె మంచి తరుణమిప్పుడు
విద్యలేకున్నను వెఱ్ఱివాఁడైనను
ధనముండుటయె మంచి తరుణమిప్పుడు
కూళయైననుగాక కుంటివాఁడైనను
ధనముండుటయె మంచి తరుణమిప్పుడు
సోమరిపోతైన శుంఠయేయైనను
ధనముండుటయె మంచి తరుణమిప్పుడు

గీ. వరులవెదుకఁగ నెడలెడు వారునేఁడు
చూచుచున్నారుధనమును జోద్యమయ్యె
కులముశీలమునామంబు కూలిపోయె
జాతిభేదంబుతొలఁగెనే సమసిపోయె.

(అనుచునిష్క్రమించును)

(తెరపడును)

---

(రెండవరంగము)

(వీథివాకిలి)

(ప్రవేశము:- వెంకటేశ్వర్లు)

(తెరలో) వెంకటేశ్వర్లుగారూ!

వెం—(వినుటనభినయించి) ఎవ్వరువారు?

(తెరలో) నేను తపాలాబంట్రౌతునండి. వైరొచ్చిందండి.

వెం.—వస్తున్నాను. వస్తున్నాను.

(అనిపోయి బంట్రౌతుసహితముగా ప్రవేశించును)

బం.—ఏమిటండి బాబూ. ఎప్పుడుచూచినా తలుపులు బిగించియే యుంటాయి.

వెం.—తెఱచియుంచితే ముష్టివాళ్ళు ప్రాణాలుకొఱికేస్తున్నారు.

బం.—(కాగితము నొకదానినిచ్చుచు) దీనిపై సంతకముచేయుండు

వెం.—(అట్లొనర్చుచు) నీవింగ్లీషుచదువుకున్నావా నాయనా?

బం.—లేదులేదు. ఇంగ్లీషుచదువుకుంటే యిన్నిపాట్లేమి? ఇదేమి కర్మము పేయువ్యోగమోచేసికొందును. నేనుబోయెదను.

వెం.—మంచిది వెళ్లేటప్పుడు దారిలో శ్రీనివాసరావుగారిని రమ్మని చెప్పరాదూ.

బం.—అలాగేచెప్పెదనులెండు

(నిష్క్రమించును)

(కొంతవడికి శ్రీనివాసరావు ప్రవేశించును)

వెం.—శ్రీనివాసరావుగారూ! రండి కూర్చుండండి.

శ్రీ—(ఆసీనుడగుచు) ఎందులకు గబురుపంపినారు?

వెం.—ఈటెలిగ్రామేమిటో చూడండి బాబూ. (అనియిచ్చును.)

శ్రీ—(చూచి) మెడ్రాసునుండివచ్చినది.

వెం.—(తత్తరపాటుతో) అబ్బాయిదగ్గరనుండియా?

శ్రీ—అగును.

వెం.—ఈరోజున వచ్చుచున్నానని నాల్గుదినములక్రిందట లేఖనంపి యున్నాడే. ఎందులకోవిమర్శించండి. నుస్తీచేసినదా.

శ్రీ—కాదండి "సెండ్‌ఫిఫ్టీరూపీస్" ఏబదిరూపాయిలుపంపించమని.

వెం.—రామరామ. ఈడబ్బునుబంపించలేకచచ్చిపోతున్నానండి. పది హేనురోజులకొక యుత్తరంసిద్ధం. ఏజాబులోజూచినా క్షేమ

సమాచారములు కనుపడవు సరేకదా ఉత్తరంవిప్పేసరికి "యిచ్చట నేను చాలకష్టపడుచున్నాను. వెంటనే యేబదిటా పాయిలు పంపించవలెను" అనునొకమాటయే ఈయింగ్లీషు చదువులమూలమున కొంపలు గుల్లతోతున్నాయి బాబూ. అయ్యో! మనవాం డెంతయిబ్బంది పడుచున్నవాండోయని అడిగినప్పుడల్లా పంపిస్తె లెక్కలేకుండా యేకాఫీహోటళ్లకో యేసిగరెట్లకో తగులబెట్టడమేకదా. వీడిచదువు తగలంబెట్ట. నెలకు రెండువందలు కూడా సరిపోవుటలేదు. పోనీయెంత డబ్బు ఖర్చైనా చదువుచున్నాండేమోయంటే ఒక్కొక్క క్లాసు నాలుగేళ్ళుకదా. నేనెంతగంగష్టపడి సంపాదించినానో అంతదుర్వ్యయం అయిపోతున్నది. మీరేమి ప్యాసైనారు నాయనా?. స్కూలుఫయినలు పూర్తి చేసినారా?

శ్రీ—ఆల్ రైట్ ఇంటర్ మిడియట్ కోర్సుకూడా కంప్లీటుచేసినాను.

వెం—అలాగునటండి. పాపమింతవరకెక్కడ నుద్యోగమే దొరక లేదుకాంబోలును. కాలమంతయు మారిపోయినది. ఇప్పటి చదువురీతి యెట్లున్నదంటే

సీ. అప్పుపుట్టినదాక యవసరమంచును
జేబదుళ్లనుదాము చేయుచుండుఁ
బినపెంబ్రాంసరినోట్లు విరివిగవ్రాయుచు
వలసినధనమును బడయుచుండుఁ
వడ్డీలు పెరిగిన వాయిదాల్ లిఖియించి
భూములందనఖాల ముంచుచుండుఁ
క్రియకుందీర్పఁగలేక క్రియపత్రముల్ వ్రాసి
మనులన్నిపోవగ మిడుకుచుండుఁ

గీ. ఇదియెయింగ్లీషుచదువుల విధమునేఁడు
ఒకనివిద్యకై ధనమంత నోడఁదుడకఁ
జెప్పకజ్జచేతికివచ్చు తెప్పదింత
లరయనుద్యోగసంపద యసలెలేదు.

అంతాపల్లకీయెక్కేవాండ్లైతే మోసేవారెవరు? ఏపెంటమీఁద నుజూచి నా బియ్యేలయందాఱితేరిన మహానుభావులే. ఏమూలనుజూచినా బి.యె. బియల్ హైకోర్టువకీల్సే. చదువంతాపూర్తియగుసరికిగవర్న మెంటువారిచ్చిన పట్టాలను జేతఁబుచ్చుకొని యింటికివచ్చుసరికి తండ్రిగారింట్లోదాచియుంచిన నప్పుపట్టాలును జేతులనలంకరించును అప్పుడాతఁడు గవర్నమెంటువారిచ్చినపట్టాను జూచికొని సంతసించునా? తండ్రిగారిచ్చినపట్టానుజూచి దుఃఖించునా? ఈరోజులలోఁ గుటుంబములో నొకఁడు కాలేజికిఁబోయినాఁడంటే మిగిలినవారంతా యాయవారంముతాలను సంపాదించితీరన్నమాటే చదివేకుఱ్ఱాళ్ళలో మూఁడువంతులు దుర్బలశరీరులేకదా. ఈస్టూడెంట్సులోఁ జాలమంది చిన్నతనమందే తల్లిదండ్రులను విడనాడుటచే భయభక్తులులేక యెప్పుడూ బుగ్గనుకారాకిల్లీలు, చేతసిగరెట్లు, హీనులైన సానివాడలఁ దిరుగుచుఁ బొట్టఁగోసిన నక్షరమేలేక నిరర్థకులగుచున్నారు. ఇంటి దగ్గర. తలిదండ్రులు "మాఅబ్బాయి యింగ్లీషుబడిలోఁ జదువుచున్నాఁడని సంతసించుచు, యుత్తరమువ్రాయుటయెతడవుగ లెక్కలేకకుండ మనియార్డర్లుచేయుచుందురు. ఎట్టినిరక్షరకుక్షులైనా స్కూలులో నుండగనే నెత్తులఁబెడపాపిళ్ళు, వీధులన్నియుఁ దుడుచువారగోచీలు, కాళ్ళకుబూట్సు, కళ్లకుజోళ్లు చేతబెత్తములు, నోటమెలిసెంట్ మార్కుసిగరెట్లు, పైగావచ్చియురాని యింగ్లీషుముక్కలు, యివి తప్పవుకదా, ఇఁక రాత్రింబవళ్లనక కాయకష్టములంబడి పరీక్షలయందు తీర్ణులైనవారిలోఁ గొందఱింటికే తెంచుసరికి దినుటకుముద్దలేక

సీ. బియ్యేలవారైన పెన్సొత్తలఁ జెంది
ప్లీడర్లకిందనో డాక్టరులని
ప్రియుఁడైనఁగాని శాస్త్ర పటుటయొయమ్యేగా
నన్నతోద్యోగముల్ సున్నయగుట
యఫ్యేలవారైన నథమమంచును లేక
నాల్గునాలుగులకే నడచుచుండ్రి
స్కూలుఫయినలైన స్కూలుమాష్టరులంచు
యెలిమెంటరీబడు లెన్నుచుండ్రి

గీ. ఇంతయేలనుదొరకిన వింతనాదె
చనుచునున్నరబంట్రోతు లనఁగనేఁడు
విద్యనేర్చినవారున్న విలువగలుగు
పదవులెచ్చోటలభియించు బ్రతిగనెప్పుడు.

పోనీ విద్యనేర్చినందులకు దగిన తెలివి తేటలఁగల్గి యితర దేశస్థులవలె గొత్త పనుల నభ్యసింపఁగలరేమోయంటే యదియునసాధ్యమే. బియ్యే. ప్యాసైనా ఎం. ఎ ప్యాసైనా యింగ్లీషుపాండిత్యము లభించుట సున్నయేకాని సంసారంలోనికి వచ్చుసరికే స్వభావమైన ఆంధ్రిబాషకు స్వస్థిచెప్పవలసినదే. అందుచేత నేఁటిగాణవిద్యాభ్యాసకు లుకుర్చీలపైఁగూర్చుండి కాఫీలనుద్రాగుటతక్క యితరపనులఁ జేయఁ జాలరు. లభించిననేదోయుద్యోగము సేయవలయును. లేనిచో పుణ్యమ తచేఁ గొంతకాలమునకు బాంధురోగికివలె శుష్కించి తుదకందుల కును నశక్తులగుచున్నారు. దేశపరిస్థితులిట్లున్నవి. పరభాష నేర్చుట కశక్యము. స్వభాషమఱపు. తుద కుభయభ్రిష్టుత్వము ఉపరిసన్యాసము. ఈమధ్య యేయెలిమెంటరీపాఠశాలలోఁజూచినా స్కూలుఫయినలూసరుకే దిగుమతియగుచున్నది. నాల్గవతరగతియందు దాఁటి తేరిన వారంతా హెడ్మాష్టర్లు, స్కూలుఫయినలవారంతా అసిష్టంట్లు.

ఏయింగ్లీషు క్లాసో యిస్తే పీడచెప్పినిడికేదూ? అన్ని చదువులు ఆలా గుననే అగోరిస్తున్నాయిలెండి. మీకేతాలూకా బోర్డులోను జుట్టాలు లేరా?

శ్రీ.—లేరు బాబూ లేరు. ఉంటేయున్నాళ్లా. ఈపాటి కే యేస్కూలులోనో యుపాధ్యాయపదవి నధిష్ఠించి పదిరూపాయిలు తెచ్చుకొనే తెచ్చుకుందును.

వెం.—మనప్రెశిడెంటుగారి దర్శనము చేసినారా?

శ్రీ.—ఏమిదర్శనమండి? మునుపు ఆఫీసి.యల్స్ యున్నప్పుడే బాగుండేది. ఒకప్పుడుకాకపోతే యొకప్పుడైనా దర్శనమయ్యేది. చెప్పుకున్నది వినేవారు. ఇప్పుడన్ననో యింటికిపోతే ఆఫీసుకు రమ్మంటారు. ఆఫీసుకు పోతే యింటికి రమ్మంటారు. సెకండరీ గ్రేడ్ వాడు మేష్టరీయిమ్మని యడిగితే లోయరు హయ్యరువాళ్లు చాలునన్నిన్ని లోయరుహయ్యరు వాళ్లు అడిగితే స్కూలు ఫయినలువాళ్ళు వేనకువేలుగ వచ్చుచుండ మీకెట్లీయగలమనిన్ని, సమయస్ఫూర్తిగ జబాబులిచ్చుచున్నారు. ఎన్నికాళ్ళుకడుపులు పట్టుకున్నా యీరోజులలో సిఫార్సులులేకపోతే చూచేదాతలేడు లేకపోతే ప్రెశిడెంటుగారికి విహితులగు మెంబర్లకుజుట్టములైనాకావలెను ఏమి చేయమనాయనా నన్నాభగవంతుడట్లుచేసినాడు కాడు. ఇవి రెండూతప్పితే రైటరుగారి కులమైననుగావలెను.

వెం.—మీకీయూహయుంటే నాతోనింతవరకెందులకు జెప్పలేదు. ఇప్పుడీటరంలో మీరీపదిహేనురోజులు లక్ష్మణరావుగారిపనుపున నేజంటుగాదిరగండి. మూడవనిమిషమున మీరు కోరినచోట మేష్టరీవేయుంచడం నాదీపూచీ.

శ్రీ—బాబూ ఇంతకన్న నేమికావలయును? తిరుగనెన్నెప్పుడు దర్శనము చేయమని సెలవు?

సెం—రెండుమూడురోజులలో కనుపడండి ఈలోగా నాలోచించెదను.

శ్రీ—చిత్తము నాకు సెలవా?

సెం—మంచిది.

(శ్రీనివాసరావు నిష్క్రమించును.)

(తెరపడును)

# పునస్సంధాన శుల్కము



## తృతీయాంకము

(ప్రవేశము — యజ్ఞ[illegible])

ఆహా! ఏనెంతదౌర్భాగ్యదశ ననుభవింపవలసినకాలము ప్రాప్తించెను హా! కాలసర్పమా! నాపాలిటికిభాగ్యదేవతవై యెట్టిదుర్గతులఁ గల్పింపసాహసించుచుంటివి? హా! దైవమా! నాకీపాడుజన్మమేల యొసంగితివి? ఇట్లునిరంతరము దుఃఖాకులస్వాంతనై దిగులందుచు మనియుండుటకన్న, మరణమే శ్రేయోదాయకముకదా. నాకొఱకు

చం. జనకుఁడుసర్వసంపదల సాహసవృత్తినిబాఱ ద్రోలి యే
దినమునుసౌఖ్యమేకనక దీనతసొక్కుచునున్నవాఁడయో
అనయమునప్పువారలఁట యాప్పులచేనడలింపజేయఁగా
తనమదిదుఃఖహర్షములఁ దాల్పఁగఁజాలునెరోగికైవడిన్.

పెఱిగి పెద్దదై ఫలాన్వితంబగు వృక్షమును జెఱుచువేరుపురుగువలెనే నీకుటుంబమును నిర్మూలమొనర్ప బయలువెడలితిని గాఁబోలును. కటకటా! నాకు సుఖము కలలోనివార్తయయ్యెనుగాని, జననీజనకులా? నామూలమున నిద్రాహారములుమాని, దుఃఖాకులచిత్తులై దివారాత్రములు తపియించుచున్నవారు. తొలుఁత నేనును నాజననియు వలదని యెన్నివిధముల నుడివినను నాజనకుఁడు పెడచెవిబెట్టెనే కాని, యించుకయుఁదలఁదాల్పకుండెను ఇదియిట్లుండ

సీ. ప్రాణేశ్వరుని జేరి భజియించుటకుమాఱు
 పాపిష్ఠినై యిట్లు పాయనయ్యె
నిజనాథుఁగొల్చుచు నెగడొందుటకుమాఱు
 దిగులొందుచునునిట్లు తిరుగనయ్యె
కాంతునితోఁగూడి కలిసియుంటకుమాఱు
 ఏకాకినై యిట్లు సొక్కనయ్యె
పతిదేవునిపాద సేవజేయనుమాఱు
 మనమందుఁ జింతతో మసలనయ్యె
గీ. కటకటా! ప్రాణనాథుని కరుణఁగలిగి
ముదమునఁ జరియించెడు యోగ మింక లేక
నాథుసన్నిధి లేక యనాథనగుచు
బ్రదుకనయ్యెను జేసిన పాపమేమొ.

ఇఁకనాకీభువినేదిశరణ్యము? నన్నిట్టికారిడుములంబడఁజేసిన నాపాపిష్ఠదైవము నేమనవలయును? (తత్తరపాటుతో) ఆ! ఏమంటిని? సకల చరాచరస్వరూపుఁడై భక్తపరాధీనుఁడై ధర్మాధర్మవివక్షతలనెఱిఁగి యేజీవి యెట్టికర్మము లాచరించెనో దాని ననుసరించి సుఖదుఃఖము లందఁజేయుచు ధర్మస్వరూపుఁడై వర్తించుచు నామహానుభావుని నిర్హేతుకముగ దూరఁదొడంగితినే. ఏను—

సీ. ఏదంపతులఁ దొల్లి యెడఁబాపియుంటినో
 యెడఁబాయనయ్యె నేఁ డిట్లు విభుని
ఏసతీపతులకు నెట్టికష్టంబులఁబెట్టఁ
 గష్టజనింపఁగఁ గల్గెనో కా..
ఏసాధువరులను నెగతాళిసేయఁగ
 నెగతాళియయ్యెనో యిట్లు నాకు

ఏమిఘనంబుల నిడుమలందగఁ జేయ
నిడుమలఁ నొందఁగ నిట్లుకూడె
గీ. ఎట్టి యపరాధములఁ గూడ నెచ్చనుంటొ
యెట్టి దుష్పథంబుల కడంగిడితినో కద
కాక, యిట్టివంతలఁ బెక్కు నాకు నగునె
కటకటా! దుర్భరంబగు నింతబ్రదుకు.

అయ్యో! నా యాత్మతాపాగ్ని యెవ్విధంబున నార్పఁజాలుదాన. అయిన నెనిమిది యకరముల భూమియుఁ బైగ రెండువేలరొక్కము సర్పించినను, నింకను రెండువేలు రావలెననికదా యాబింకములు. వారి నననేల? ఈయపరాధమంతయు నాజనకునిదే. నిండు జవ్వనినై పుట్టినింటఁబడి తపతపలాడు నాఁబోటి యాడుపడుచులకు పురుషసంపర్కము లేకుండఁ జేయువారి కాభగవానుఁ డెట్టిదుర్గతుల గలుగఁజేయునో కదా! అనంతములగు యీనరకకష్టముల దురాగతమనుభవింపవలసినవారము మేమా? ఏమి న్యాయము! న్యాయాన్యాయము లడుగంటెనా? ఈపిశాచమును దేశమునుండి తొలఁగించు పుణ్యపురుషులే లేరా? నాబోటి యనాథుల మొఱలీలోకమున నరణ్యరోదనములా? పుణ్యపాపములు నశించెనా? నాలో నేననుభవించు చింతలెన్నియైన నిరుగుపొరుగువారి యెత్తిపొడుపులకుఁ దలయెత్తుటకు వీలులేకున్నది కదా!

సీ. వయసువచ్చినవెన్క వసియించుఁ బుట్టింటఁ
బనికిమాలినదంచు పలుకు నొకతె
నాపురంబును లేక కాపురంబునఁ దిగ్గ
దిక్కుమాలినదంచు తిట్టు నొకతె
ఇట్టులిట్లాడు నిరుగుపొరుగుఁ జేరు
రాకాసియగు నను రాము యొకతె

పతివిడనాడినపశుచుకదా యీామె
యనుచు హేళనసేయు సవని నొకతె

గీ. పలుకరాని దుర్భాషలఁ బలుకు నొకతె
లెక్కసేయరు మర్యాద లేశలేదు
కన్నతల్లియె దూషించు కట్టుకడకు
మగని విడనాడి చరియించు మగువకిన్న
జుల్కనగ నెట్టియునులేదు చూడఁజూడ.

పతిశుశ్రూషయే సర్వవిధముల భామలకిహాపరసాధనమనినమ్మివర్తిం చి జగద్విఖ్యాతిగాంచుహిందూసుందరుల కెట్లివాట్లు జనించెను ? హా! భరతమాతా ! ఈవరకట్నంబు లనియెడు పిశాచము లావహించి సతీపతుల విడదీసి నీపుత్రికల బాధించుచుండ నెట్లోర్చుచుంటివో కదా!

గీ. పతియె దైవము సతులకుఁ, బణతులెల్ల
నిష్టకామ్యార్థసిద్ధిని నెంతురేని
మదిని నాతనిఁ దలఁచుచు మఱువకుండఁ
జేరి పరిచర్యసేయు టే శ్రేయ మగును.

అను నార్యోక్తిని దలఁదాల్చి తొల్లి యెందఱెందఱు యువతీమణులు యిహపరసుఖంబుల ననుభవింపలేదు. సావిత్రి పతిభక్తివలననేకదా నిజనాథుని జీవములఁ గాచుకొనఁగల్గెను. నాకట్లు పతినిగొల్చి సౌఖ్య మందుభాగ్యమే లేకపోయెనే.

గీ. పరులయెడ ససహాసముతోఁ బరగనెప్పుడు
గర్వమెన్నఁడుఁ దలపోయఁ గడఁగనెందు
పతిని మనమున పీడియు భక్తిలేక
యూహమతి సంచరింపంగఁ బోల్చలేదు.

(ప్రవేశము—విశాలాక్షమ్మ, గోపమ్మతో)

వి—రుక్మిణీ! యేమే యింతపొగరు? ఎప్పుడును ఏకాంతముగనే కూర్చుండి యేదో యాలోచించుచునేయుందువు. ఇప్పుడే యింతసోమరితనము బలిసినదేమే! కాపురంచేస్తూంటే యిప్పటికి పిల్లలను గనేయివాడు. కాటుకలేదు. బొట్టులేదు. మూండుపూట్లా తినడం. మూలఁ జతికిలబడడం. చిన్నప్పుడెంతబుద్ధిగా నుండేదానవో యిప్పుడంత మొండికెత్తినావు. ఛీ! ఛీ! దరిద్రదేవత యండఁజేరి "ఓ" యని యెప్పుడూ పలుకుతూ ఉంటుంది. నీమూలమున ఆయన సంసారమంతా నిర్మూలమైనది.

రు—(కన్నుల నీరునింపుచు) అమ్మమ్మా! నేను దరిద్రగొట్టురాలను గాకుంటే యీగతియేమి? అందరివలెనే నేనును గాపురము నకుఁ బోయియుందును.

వి—మాటమాటకు ధిక్కరించుటకూడ నేర్చినావు. నీకర్మం నీవను భవించనలదా? వెదకివెదకి సంబంధము కుదిర్చి పెండ్లిచేస్తే వాళ్ళకు ధనపిశాచంపట్టి యేడిపిస్తున్నారు. ఉన్నభూమి, డబ్బు పోవడమేకాకుండా పైగా నిరుగు పొరుగువారివలన నిందలు తప్పుటలేదు. ఇంతకు అనుభవించేవాళ్ళ యదృష్ట మునుబట్టి యిటువంటిబుద్ధులుపుట్టుచుండును. ఈసోది యెప్పుడూయున్నదే. నీవు నేను బ్రతికియున్నంతకాలము నిన్ను జూచి నేను, నన్నుజూచి నీవు యిట్లు లేడ్చుచుండవలసినదే. అబ్బాయి లేచేను. ఒకసారి ఆడించు. (అని నిష్క్రమించును)

రు—అక్కటా! కన్నతల్లికిని బగదాననైతినే. ఇంకను నింతటి హేయమగు బ్రదుకేల బ్రదుకవలె?

గీ. గర్భమునఁ దాల్చి ప్రేమను గన్నతల్లి
పగను బట్టిన నీపని విగతదయను
నిందలన్ బుష్పఁ దాడఁగాను నిలువ నగునె
జనముల వినుటె యింక శ్రేయమొసఁగ.

హా! ధనపిశాచమా! నీసాహసమంతయుఁ బతిని విడనాడిన యనాథగదా యనినహా నాయెడఁ జూప మొదలిడితివి. మానవులు మూఢాత్ములై నీనీచపు ప్రవర్తనల నెఱుంగలేక నిరతము నిన్నే సేవించుచు నీదాకనే కోరుచుందురు. సరిగఁ నిర్వచించిన నీయంత పాపిష్ఠి-దేని సుగుణముకలదా?

ఉ॥ ఆసలఁ గొల్పుచుందువహా యంతయు నాపదనుపంచుఁ జూపి పె
ద్దానను నిన్నుఁ జేరినను దక్కనికైనడి పొప్పునానఁగన్
వేసములెన్నియేని యిడ వింతలఁ జూపెదు మూఢచిత్తులై
దాసులభంగిఁ గొల్తురయొ తథ్యము నీచము నిన్ను నమ్మినటుల్.

అగ్నిసాక్షిగాఁ బరిణయమాడి జీవితాంతముదాఁక నొండొరులయెడ మిక్కుటంబగు ప్రేమచే నలరారు సతీపతులకుఁ గయ్యములఁ గల్పించి వేఱుఁ జేయు యవినీతివి నీవేకదా. ఒకగర్భమున జనించి యన్యోన్యానురాగంబులఁ జిరకాలముండి కాలమునుబుచ్చు సోదరులకు శత్రుత్వముత్పత్తిఁ జేసి విడఁగొట్టు పాపిష్ఠివి నీవుకాదా? చిన్ననాఁటనుండియుఁ బెంచి పెద్దవారలఁ జేయు జననీజనకులను సుతులు తృణప్రాయముగఁ జూచునట్లొనర్చెడి దుష్టత్వము నీదికాదా? మెల్లమెల్లగ దఱిఁజేరి నిరంతరము నిన్నే సేవింతునని యెంతయో ప్రేమగలదానివలె నటించి తుదకు నడియేటను ముంచివైచు నీచప్రవర్తనురాలవు. నిన్నే నమ్మి చరించు నరులకు—

గీ. శాశ్వతంబగుస్వర్గ మశాశ్వత మసి
నీదు సాంగత్యమే మది నిత్యమనియుఁ
దోపఁజేతువు సతతంబు దుష్టబుద్ధి
తగునె యవగుణంబుల నిల్పు టధమమగును.

నీవు లేకున్న నీప్రాపంచిక సృష్టియే నిరర్థకమని యెంచికాఁబోలు నాచతుర్ముఖుఁడు నిన్నిందులకుఁబంపెను. నోరెఱుంగని బసబాలురు సహితము నిన్నాదరింతురే. నిక్కముగ నీయంత విశ్వాసఘాతకు లింకొక్క రుండరు.

సీ. గౌరవమని నిన్ను గారవింతురెకాని
గౌరవహీనంబె కానవచ్చు
సుఖకారివని నిన్నుఁ జూచుచుందురెకాని
యసుఖమే నీయెడ నవతరించు
స్వర్గమె నీవని చాటుచుందురెకాని
నరకబాధయె యెప్డు నడచుచుండు
కార్యసాధనమని కాచుచుందురెకాని
కార్యవాదివి నీవు కానె కావు

గీ. అర్థమే యన్నిటికిని యనర్థకంబు
యనెడు బుధులవాక్యములను నఱయ కీవు
మిట్టిపడెదవు సతతంబు పట్టిగొడ్డు
కాస్పు లెక్కువ యనియెడు మాటనిజము.

అట్టికాసున్న వేలకొలఁది కట్నమర్పించిన నాకు సుఖమొదవునని కదా నాజనకుఁ డట్లొనర్చెను. అందుచేఁ బేరాస మఱింతవృద్ధియై మొదటికే మోసమువచ్చెను. సౌఖ్యమెటులున్నను నీమూలమున గష్టముల కాటపట్టయ్యెను. (ఆలోచన నభినయించి) అయ్యో? ఏ **నెంత యవినీతిని.** తుంటఁగొట్టిన పండ్లురాలెనను సామెతరీతి నేఁ

ద్రోలిఁ జేసిన పాపపుఁగర్మ నెఱుంగక, మూఢచిత్తనై, యొరుల దూషించుటెంతటి నైచ్యము. కర్తవ్యమూహించుటయే సుఖదాయకము.

(కన్నుల నీరునింపుచు)

ఇంకను గర్తవ్యమేమికలదు? అన్నిటికిని నొకటె కర్తవ్యము. ఆత్మహత్యయే యిఁక నే నొనర్పఁదగిన విధికృత్యము.

(అని నిష్క్రమించును).

---

రెండవ రంగము.

(ప్రవేశము:—రామచంద్రరావు, నారాయణరావు)

రా—నారాయణా! చెన్నపురినుండి యెప్పుడు వచ్చినావు?

నా—మాగ్రామమునకు నెలదినములకుఁబూర్వమే వచ్చినాను.

రా—నెలదినములక్రిందట వచ్చినను నొకమా ఱటకువచ్చుటకుఁ దీరికకలుగలేదా?

నా—మామగారూ! మిమ్ముఁజూడకుండఁగ నొక్కగడియయైన నుండఁగలనా? మీరిట్లు నిష్ఠురములాడుట చెల్లునా? ఎప్పటి కప్పుడే పయనము కాగా, పెండ్లికి సంబంధములు వచ్చుచున్న వనియుఁ గొంతకాల మింటనేయుండి పోవలయుననియు, మా యమ్మ చెప్పుటచే నామెమాటను మీరలేక రాఁజాలనైతిని. నాజనకుఁడు గతించినదిలగాయతు జనకునిపగిది, విద్యాబుద్ధుల నారితేరఁజేసి, పెంచి పెద్దగఁజేసిన మీయుపకారమును మఱచి నేఁడు కృతఘ్నుఁడ నగుదునా?

రా—సంబంధ మేదైన స్థిరపడినదా?

నా—మాతల్లి కట్నములకొఱ కాసించుచున్నది. కాని, నేనందులకు హర్షించుటలేదు.

రా—ఎందులకు వలదని నీయభిప్రాయము?

నా—మామగారూ! ఈకట్నములమూలమున జరుగుచున్న దురా
గతము లిట్టివి యిన్నియని నుడువుటకు వీలులేకున్నది. మీరే
ననుదినము వార్తాపత్రికలఁ జూచుటలేదు కాఁబోలును. కొన్ని
కొన్ని కుటుంబములు తమకున్న యాస్తులన్నియు విక్రయిం
చుకొని తినుట కన్నమును, కట్ట గుడ్డయును లేక దీనులై పడ
రాని యిక్కట్టులం బడుచున్నారు. కొందరీ లేమి ననుభవిం
చలేక ప్రాణములనే వదలుచున్నారు. ఇట్టి దురవస్థలను
గనులారఁ గాంచుచును నెట్లు సిద్ధపడఁజాలుదును?

గీ. ధనము నార్జింప వేఱగు దారిలేదె
పిల్లనిచ్చెడు దాతలఁ బీల్చి వారి
దుఃఖసాగరమందున దూలఁజేయు
పుట్టినాన్యాయంబు తెలిసోయ హీనవృత్తి.

ఇదియునుగాక, కట్నమును గొనుటతోడనే వారి కమ్ముడై జననీజన
కులకుఁ బరలోకక్రియలాచరించుట కధికారము లేకపోవునుగదా.

రా—అగును. నాయనా! అగును. నీపల్కులన్నియు సత్యములే.
అయినను గలికాలము. న్యాయాన్యాయవిమర్శన లెవ్వరికిఁ గా
వలెను. అన్యాయమే యీదినములలో ధనార్జనసేయుటకు
మూలమైయున్నది. దీని కేమికాని మీయమ్మను జూచి చాల
దినములైనది. నీతోఁగూడ నొకసారి తీసికొని రాలేకపోయి
నావా?

నా—ఎందుచేతనో, యామె యిల్లువీడుట కిష్టపడుటలేదు. నేను రమ్మ
నమనగా రుక్మిణి కార్యమున్నదికదా. అప్పుడు వచ్చెద
నన్నది.

రా—(విచారముతో నిట్టూర్పులఁ బుచ్చి) అయ్యో! అంతటి
భాగ్యమా?

నా—(ఆతురతతో) అదేమి? సుముహూర్తము నిర్ణయింపఁబడినట్లు లేఖ వ్రాసితిరిగదా.

రా—ఆలాటి ముహూర్తములు చాలగడచినవి.

నా—మరల యాటంకమేమి?

రా—ఆటంకమున కేమున్నది నాయనా! పెండ్లికాలమునందు రెండు వేలు బాకీపడితిని. కన్యాదాన ప్రతిఫలముగా నిచ్చితిని కాని, కార్యముచేసికొనకుంటె, దావాచేసెదమని రెజిష్టరు నోటీసు.

నా—రామ. రామ. ఉన్నదంతా యర్పించినా యింకను సరిపోనయేనా? (ఏదో జ్ఞప్తికి దెచ్చుకొని) దావాయంటే జ్ఞాపకము వచ్చినది మీయింటికి వనఖాలువగైరాలున్నను, దమయంతీ రేవలకు యెవరికిని జెల్లకూడదని గెజెట్టులో పబ్లిషు చేసినారు. అదెవరో యనుకున్నాను. మీరాసంబంధమును కాసించుటయే చాల పొరబాటు. అందులనుగూర్చి యేమి యాలోచించినారు?

రా—ఒకటే యాలోచన. వారికివ్వగా మిగిలినది రెండువేలరూపాయలు. దానిపైఁదెచ్చిన ఋణము రెండువేలు. వడ్డీతోఁగలిసి యీ సరికే రెట్టింపగును. ఉద్యోగమువల్ల వచ్చే సొమ్ము పొట్టకూటికే చాలదు. ఇంటిని విక్రయించి సొమ్ము నీయవలసినదని వారికోరిక-రుక్మిణికి నిద్రలేదు. ఆహారములేదు. ఆమె యింట బెంగతోనుండ మాకు సంతసమెక్కడిది? కృష్ణవేణికిని బెండ్లి యీడు వచ్చినది. ఏమి సేయుటకును దోచకున్నయది.

(తెరలో)

రామచంద్రరావుగారూ! రామచంద్రరావుగారూ!

నా—ఎవ్వరో మిమ్ములనే కాఁబోలును బిల్చుచున్నవారు.

రా—ఎవ్వరు వారు ?

(తెరలో)

కోర్టుజవానునండి.

రా—లోనికి రమ్ము.

(కోర్టు బంట్రోతు ప్రవేశించును).

బం—రామచంద్రరావుగారు యెవ్వరండీ ?

రా—నేనే. ఏమది ?

బం—సమను వచ్చినది. (అని యొకకాగితము నొసంగును).

రా—(గ్రహించి యధామూలాగ్రముగఁ జదివి) చెప్పినట్లంతయును జేసినారు.

నా—వియ్యాలవారు దావాచేసినారా ?

రా—ఆ. అదే నోటీసు.

నా—ఎంతకు ?

రా—అసలు రెండువేలు. వడ్డీ అయిదువందల యేబది.

నా—నారాయణా. ఎట్టిఘోరములు జరుగుచున్నవి ?

బం—నాకుఁ బ్రొద్దుపోవుచున్నది. వ్రాలుచేసి యివ్వండి.

నా—కూపహాళ్ళు త్రిప్పివేయుఁడు. తరువాత చూచుకొనవచ్చును.

బం—అదెట్లు ? సీలులేదు.

నా—నీవిషయమై చెప్పుతాముకదా.

బం—(ఊరకుండును).

రా—ఎప్పటికైనా తప్పునా? కావున నిప్పుడే పుచ్చుకొనెదను. (అని వ్రాలుచేసి యిచ్చును).

(బంట్రోతు నిష్క్రమించును).

నా—ఈ కేసులో న్యాయవాదిని నియమించి ప్రతివాద మొనర్చు టయే ముఖ్యకర్తవ్యము. లేకున్న నాలుగువేల కిమ్మత్తుగల్గిన

యింటిని వేలము వేయించును.

రా—ఇంకను దీనికిఁ బ్రతివాదముకూడ గావలయునా? అయినను నాలోచింతము.

నా—కచేరీలలో దేనికిఁ దగినట్లు దానికి సాక్ష్యము చేయవలెను. సాధారణముగ నీకాలమున వచ్చిచ్చినవారు వడ్డీలకు వడ్డీలు పెంచి, ఉన్నయాస్తినంతయు వేసికొనఁ జూతురు. ఇఁక బదులు పుచ్చుకొన్నవారన్ననో బదులుపుచ్చుకొని యీవలకఱు దెంచినది లగాయతు యేరీతి దాని చెల్లకుండఁ దప్పించుకొన వచ్చునని యాలోచించుచునే యుందురు. ఉభయులు మోసమునకే యత్నించుచుందురు. తుదకు పనిలో పనికిఁ గుడు అక కోర్టులకుఁబోయిన, ముందుగఁ క్షీడగ్రహింపనను, పిమ్మటఁ గోర్టుల ఖర్చులకిరింనను, నున్నసొమ్మంతయు నోడి, గుడ్డ అకునుగూడఁ దగిన బ్రాయశ్చిత్తమై, వావా సొమ్మునకు నాలుగురెట్లు హెచ్చుగఁ బోయి నెత్తులు గొట్టుకొనుచు గెల్చినవాఁడు యింటిలోను, నోడినవాఁడు బయటను నేడ్చుచుందురు. వీరికి దగినట్టిశిక్షలను గాచుకొనియుండి...

సీ॥ నాదియైనను బత్రి వాదియైనను జేర
వారమ్మటంచును రసులఁగొల్చి
సత్యమేయైన న సత్యమేయైనను
భయమేల యని ప్రతి గ్యములవల్ల
చేరినవెనుకను పోరు సల్పుచువెంట
ధనమంతయునులాగ దారి వెదకు
చేపంచు మాపంచు చూసించి నాయిదాల్
వత్సరంబుల నెన్నో వరుస గడపు

గీ॥ తుదకు గెల్చిన దనశక్తిఁ దోఁపఁజేయు
ఓడినన్ పీడకుండఁగ నొప్పితోడ
బోధనల్సల్పి పైకిని బోవఁజేసి
అంతమగుదాక వదలరి యాటనల్పు॥

ఇంతయేల? కోర్టులకుఁబోయిన సాధారణముగా వాది ప్రతివాదులు నష్టవృత్తులై యుండఁగఁ దేలుననుట సర్వకల్ల. ఆవకీల్సు సత్య మసత్య ముగాను, అబద్ధము నిజముగాను, బొర్లించి న్యాయమూర్తులను మభ్య పర్చి తలక్రిందులుగ మార్చివేయుదురు. ఈకోర్టు లాలోకమాదిరి కాదు. ఆసమయమునకు కేసుకుఁదగినట్లుగా ప్రైవేటుకోర్టుత్రిప్పులనో ముందజేడి, దాని స్వభావము, దీని స్వభావము యొకటియే యని బొంకుచుందురు. ధనవ్యయమునకు ముఖ్యసాధన మీకోర్టులే. పోలెడుబియ్యము పోదిగిఁబోతే కుంచెడుబియ్యము కుక్కయెత్తుక పోయెనను సామెతరీతి, నిజమని సొమ్ము రాఁబట్టుకొనుటకుఁ గోర్టు లకుఁబోతే దానికి రెండింతలో, మూడింతలో ఖర్చౌతోఁ దేలును. పూర్వ మిన్నికోర్టులు కలవా? ఇప్పుడన్నచో యేపల్లెటూరునందున జూచినా కోర్టే. అసగా పూర్వము కలహములుపుట్టినను ప్రజలు తమ గ్రామములోనే తగుమనుష్యులను మధ్యవర్తులుగఁ గోరుకొని తగవులు తీర్చుకొనుచుండెడివారు. ఇప్పుడెవరికి వారే స్వతంత్రులు. పెద్దలేఁడు. పిన్నలేఁడు ధనమనిన లక్ష్యములేదు. పదిరూకలకో దావా దాఖలగునని పోవును. తుదకుఁ బదివందలుకూడా సరిపోవు. ఏది యెటులున్నను, నిందులో వాదముచేయుట తప్పదు.

రా—సలహా చేయుదము. ఈవిషయ మిటులుండఁ గృష్ణవేణిఁ బండ్రెండవయేడు కూడా గడువనున్నది. ఏమియును తోచుటలేదు. తాలుతఁ గట్టుకొనక

గీ॥ హితముఁ జెప్పెడువారల హితులఁబగిది
తోఁచి రప్పు డనుభవములఁ దోఁపఁజేసె
నిక్కమిదియంచు అక్కటా! నెనరు లేదు
ధనము నశియించె పాట్లను దప్పవయ్యె॥

నారాయణా! చుట్టమవైనను, మిత్రుఁడవైనను నీవే. అజ్ఞానముచేఁ జేసిన యపరాధముల లెక్కింపక, కృష్ణవేణిని...

నా—మామగారూ! మీరింతగఁ జెప్పవలెనా? మాయమ్మతోఁ జెప్పి వర్తమానమంపించెదను.

రా—నీవాడంబడిన నామె వెనుదీయునా? కావలసినవాళ్ళము- మంచిచెడ్డల నాలోచించుము. బుద్ధిజాడ్యంబున నీయట్టి సుగుణవంతుఁ డింటనుండ, నీయత్త యెన్నివిధములఁ జెప్పినను "దూరపుకొండలు నునుపన్నట్లు పెఱటిదారిని బోయితిని. నీవీ మహోపకారమును జేసిన నామనమునంగలచింత కొంత వఱకు శాంతించును.

నా—సాధ్యమైనంతవఱకు కలుతే యొనర్చెదను.

దా—భోజనమునకు వేళయైనది. పోవుదము రమ్ము. అడుగ మఱచితిని. పట్టపరీక్షయందు తీర్ణుఁడవైతివఁట కాదా? ఉద్యోగ పుఁబ్రయత్న మేమైన సేయుచున్నావా?

నా—అగును. యత్నమొనర్చుచున్నాను.

(ఇరువురును నిష్క్రమింతురు).

(తెర పడును)

# పునస్సంధాన శుల్కము

## చతుర్థాంకము.

(ప్రదేశము :— అనంతరావుగారి కచ్చేరిచావడి)

(ప్రవేశము :— అనంతరావు కుర్చీలోఁ బండుకొనియుండును.)

అ— అబ్బబ్బా ! ఈప్లీడరీవృత్తిలో అంతా డబ్బే అంటారు కాని, కన్ను బొడుచుకున్నా కాని కనుపించదు. ఈరోజులలో డంబాచారమునుబట్టి డబ్బు లాగవలసినదే కాని, యెంతచదువుఁ జదివినా బురదలోఁబోసిన పన్నీరే. ఇంటింటి కొక్కప్లీడరుంటుంటే అందఱికిని గేసులెక్కడనుండి వచ్చును. అక్కడకీ పదిరూపాయిలు ఫీజు రావలసిన కేసుకు పదిడబ్బులుమాత్రం పుచ్చుకుంటానన్నప్పటికి యెవ్వరూ కస్పట్టరు. పట్టావచ్చి పదేండ్లయినది. ఈచదువుకు తెచ్చిన బదులుకు వడ్డీయైన యివ్వలేకున్నాను. పోనీ యీతాలూకాబోర్డు ప్రెశిడెంటుషిప్పైనా శాశ్వతముగానుంటే కొంతడబ్బును ప్రోగుసేయవచ్చుననుకుంటే యీటరంతో సదియు నిల్చునట్లు తోచదు. దానికిని ఓట్లసిష్టం. ఎట్టినిరక్షరకుక్షులైనా పదిమంది పలుకుబడియుంటే పదవి అరచేతిలోనిదే. వాఁడు తినలేఁ డొకఁడికి పెట్టలేఁడు. ఈవృత్తులకన్న యాయవారమే మేలని తోస్తుంది. డబ్బు లేకపోయినా డంభాచారములు తప్పవు.

కోర్టుకుఁ గాలినడకను బోతే యవమానము. బండిమీద పోవుటకు నాడం లేదు. ముందునకుఁ బోయిన నుయ్యి. వెనకకుఁ బోయిన గొయ్యి. ఏయితరయుద్యోగములు లేక ప్రతివారు బి. యే. కాగానే లా కాలేజీలు చేరుచున్నారు. ఊరికే కూర్చుంటే ఉప్పుగాపైన యిచ్చేవారు లేరు.

(తెరనంకఁ జూచి)

అదిగో! యెవ్వరో వచ్చుచున్నారు. ఎవ్వరో యననేల? మన శెట్టివెంకటేశ్వర్లే. సిగ్గు పడ్డ వచ్చుచున్నాడు. మనుజులు మాత్రము జరుగవలెను. ఎలాంటివాళ్ళనైనా సహాయమొసంగి ముంచి, యెట్లో ధనమును క్రమక్రమముగా లాగవలయును.

సీ. ఇచ్చిన లేకున్న తెచ్చినఁ దేకున్న
రండంచు మర్యాద యుండవలయు
సీటుగోటులఁజూపి నిర్లక్ష్యభావంబుఁ
దోఁపఁజేయుచు నుండుఁ దాలిమిఁ భవిష్య
విత్తంబు హెచ్చని వెనుకంజవేసిన
మధ్యవర్తులఁబెట్టి మాన్పవలయు
వచ్చి చేరినదాని వలుకరించుటమాని
ధనముతోఁ బనియని తగలవలయు
గీ. చనవుఁగల్గించి నిజమను సానిసగిని
వెనుకవెనుకకుఁ దక్కుచు వేలకొలఁది
ధనము లాగంగఁజూచుటే తగినవిధము
వడ్డివున్నట్టియే మేలయ్యె పట్టిచూడ.

(ప్రవేశము :— వెంకటేశ్వర్లు)

అ— ఓహో సాహుకారుగారు దయచేసినారే. రండు. దయచేయుఁడు. (అని యొకకుర్చీని జూపును).

వెం—(కూర్చుండి) ఏమి సాహుకార్లండి. కాకితాలుచూచుకుని సంతోషించేరోజులు వచ్చినవి. బదులు పుచ్చుకునేటప్పుడు తన బాబుగారి సొమ్మని పట్టుకువెళ్లడం. ఇచ్చేటప్పుడు కన్నుల నీరుఁ బెట్టడం ప్రతీవాళ్లకు అలవాటైనది.

అ—ఏమది? ఎవ్వరైనా బాకీ యివ్వమని తిరస్కరించినారా? తిరస్కరించినంతమాత్రమున నేమగును?

వెం—ఒక రన్నమాటేమిటిబాబూ. అంతా అదేమాదిరి.

అ—నాకు అర్జంటుపనియున్నది. ఏదైనా స్టయింటు వ్రాయవలెనా?

వెం—(తనలో) నీకెప్పుడూ అర్జంటే. గోళ్లుపునుక్కుంటూ కూర్చుండడమేకదూ. అన్నీ లంజెవేషాలు. లంజటక్కులు.

(ప్రకాశముగా)

(కాగిత మొకదానినిదీసి) ఇదిగో! దీని నామూలాగ్రముగఁ జిత్తగించండి. (అని యిచ్చును).

అ—(చదివి) ఈ సొమ్మీయలేదు.

వెం—ఇవ్వడమా. జవాబుయిస్తే సొమ్మిచ్చినంత ఫలితం. తుదకు నోటీసు యిచ్చినా ప్రత్యుత్తరము లేదు.

అ—ఈయన మీవియ్యంకులేకదా.

వెం—కనుకనే యింతపొత్తు.

అ—ఇవ్వనన్నారా?

వెం—ఉన్నసంగతి మనవిచేసుకున్నానుగదా.

అ—ఆశ్చర్యము. ఈమధ్య అన్నీ యీలాంటి దావాలే. ఈబదులు పెండ్లికిఁ బూర్వమా? పిమ్మటనా?

వెం—పూర్వమే.

అ—వీరు కట్నమెంత యిచ్చినారు?

వెం—పుట్టెడు భూమి. రెండువేలు రొక్కము.

అ—నాలుగువేలు కాదా?

వెం—తక్కిన రెండువేలు యివే.

అ—అదాకథ. పోనీ వియ్యంకుడుకదా. అంతమాత్రమునకు దావా చేసి సొమ్ము రాఁబట్టుకోవలయునా?

వెం—మీరు చెప్పినది బాగానేయున్నది. వియ్యంకుఁడని యింకొక వెయ్యి యెక్కువియరాదా ?

అ—మీతో నాకు వాదమెందులకు? ప్లైంటిప్పుడే వ్రాసెదను.

(అని లేవఁబోవును.)

వెం—వ్రాయవచ్చును. ముందుగ నోటీసింకొక టీయవలదా?

అ—నోటీసువలన నేమిప్రయోజనము? వేడినీళ్లచే యిండ్లుకాలునా! ఇదియొక కాలయాపనగాని యందువలన లాభములేదు. ప్లయింటు దాఖలై సమనులు వెళ్లేసరికి మనసొమ్ము వడ్డీ సహితముగా వచ్చును.

వెం—ఫీజుమాటేమిటి?

అ—(నవ్వును నటించి) ఫీజా! ఫీజుమాటకేమిలెండి. మీరెఱుఁగరా మీదావా నెగ్గుటయే మాకుఁ బ్రధాన్యముకాని మీవంటి వారియొద్ద సామాన్యులకువలె నొక్కి వక్కాణించ నోరాడునా? (కాగిత మిటునటుఁద్రిప్పి ఆలోచన నభినయించి) ఇందులో వాదముచేయుట చాలకష్టము. ఏమందురా? కట్నము కొఱ కీయవలసిన సొమ్మని ప్రతివాది బుజువుచేసేయెడల చాల గందరగోళమగును. మనశాస్త్రములలో నెక్కడవెదకి చూచినా యీవరశుల్కములవిషయమై కన్పట్టదు.

వెం—అయితే గెల్చుట యనుమానమేనా?

అ—నాచేతిలోఁబడ్డ సూటేదియు నింతవఱకెన్నఁడు పోయినదనిన వారు లేరు. దీనియబ్బకేసులు నెగ్గించినాను. మామూలుప్లీడ

క్లు తక్కువఫీజు కోస్తారని చాలమంది యక్కడకుఁ బోయెదరు. కాని, ఓలి తక్కువని గుడ్డిదానిని పెండ్లియాడితే కుండలన్నియుఁ బోఁగొట్టును. సామర్థ్యత గ్రహించవలెను. అవన్నియు మన కెందులకు ? ఫీజుమాత్రము కొంచెము...

వెం—ఇందులో నేమున్నదండి ? వా దెన్నివాదించినా నోటుబాకీ యేకదా.

అ—వెంకటేశ్వర్లుగారూ ! పోనీ యీ కేసులో నేను బ్రతివాది తరఫుననుండి వాదించి నిమిషములమీద డిస్మిస్ చేయించనా ?

వెం—బాబూ! ఇంకొకచోటకుఁ బోయెయెడల నిచ్చుటకు రావడమెందులకు ? మాయింటిప్రక్కనున్న ధరణీప్రగడ రావూరావుగారి నెఱుఁగుదురుగదా.

అ—నిజమే. ఆయనకిచ్చిన బాగుండునే. కేసు దాఖలుకాకుండగనే డిస్మిస్ అగును. నేను మొదటనే చెప్పలేదా? అంటతిని ఓడి ఒడపోయకుండా యిక్కడకు వచ్చినారా? నేను జెప్పెడిదానిలో నొకటైనా యబద్ధముంటే నేనిందులో దమ్మిడీపుచ్చుకోకుండా యుచితముగానే పనిచేసెదను.

వెం—అయితే తమయభిప్రాయమేమి ?

అ—మాకేయవలెనని ముఖ్యముగా యుద్దేశ్యమే లేనప్పు డభిప్రాయమెందులకు ?

వెం—అభిప్రాయమే లేకుంటే యిక్కడకు రానేల ? ఒక వందరూపాయిలు యిచ్చుకుంటాను. పనిచేయించండి. మనపక్షమైతే తరువాత మీరున్నారు. నే నున్నాను. ఈదావా నెగ్గినదంటే యింక మీదగ్గరకే వచ్చుచుందును. తెల్లవాటి లేస్తే బోల్డుదావాలు. మీ రెఱుఁగని దేమున్నది ?

అ—(విసుగునలతో) ఏమిటయ్యా! ఏదో పెద్దమనుష్యులు, సాహు కార్లుకదా యని, మాట్లాడుతుంటే వంకాయలబేరమా? నిలువని కేసు నిలుపడం మాటలా? రెండుకు తక్కువైన మాట్లాడ నగత్యములేదు.

వెం—అయ్యా! అటులే చేయవచ్చును. మరల వచ్చెదను.

అ—మీయభిప్రాయమేమి?

వెం—మరల వచ్చెదనులెండి. (అని యీవలకుఁ జనును).

అ—అయ్యో! వచ్చినవానిని బోఁగొట్టితినే.

(ఆతురతతో)

దామోదరా! దామోదరా! (అని కేకలిడును).

(ప్రవేశము—దామోదరుఁడు)

దా—(తనలో) ఏదో కొంపమునిఁగినది కాఁబోలును. పని యున్నా లేకున్నా యీదుస్తారామే. నాకుఁగూడ లాభించేదిలాగే తో స్తుంది. (ప్రకాశముగా) బాబూ! ఏమి సెలవు?

అ—ఇప్పు డొకపార్టీవచ్చి, ఫీజుదగ్గర కుదురక వెళ్ళుచున్నాఁడు. ఆయన వంద యిస్తానన్నాఁడు. నేను రెండువందలిమ్మన్నా ను. ఏదోమోస్తరుగాఁ దీసికొని రమ్ము.

దా—మీతో నింతకుముందు మాట్లాడుచున్న బ్రాహ్మణుఁడేనా?

అ—అగును.

దా—అయితే నావల్ల కాదు. ఆవందకైనా యొట్లొడంబడినాఁడోకాని, పిల్లికి బిచ్చముపెట్టని మహానుభావుఁడు. ఇప్పుడే నేను బోయిన మీరే పంపించినారని గ్రహించి యెంబడినమ్మాయులకే కావ లయు నసును.

అ—వెళ్లి రమ్ము. ఆలస్యమైన నాతఁడు వెళ్ళిపోవును. కొంతదూరము పోనిచ్చి కలిసికొనుము.

దా—నామాట...

అ—నీవందులోఁ బది తినవచ్చునులే.

దా—ఇంతా కష్టపడితే పదితినాకలా? నాకక్కఱలేదు.

అ—నీయభిప్రాయమేమి?

దా—రెట్టింపు.

అ—నిన్ననవలసిన బనియేమి? మావృత్తి యంతనీచమైనది. సరే వెళ్లి రమ్మని.

దా—చిత్తము. (అని యీవలకువచ్చి)

దా—అందితే జుట్టు. అందకపోతే కాళ్లు. పార్టీలు దగ్గరకు రాఁగానే హోదాలు ప్రకాశించి మాట్లాడుతే గౌరవహీనంబని తలతురు. వారును వీధిలోనికి దారితీయగనే, మమ్ములను, మమ్ములను బంపి కాళ్లుపట్టమనడం. "ఆవు, దూడయుండ నడుమగుంజాగ్చె" నన్నట్లు పార్టీలు క్లీడర్లు యుండగా మధ్య మాకా. అన్నప్రకారము నిల్చుటకుఁ దగినంత రాబడి యుంటే యిబ్బందిలేదు. ఎఱిఁగినవాఁ డెవ్వఁడు రానేరాడు. ఈలాటి లోభి యెవ్వరో రాకరాక వస్తే వచ్చినంతమట్టునకు రాఁబట్టుకోక సెగసెల్లు. అప్పుడు వంకాయలబేరమా అనడం. ఇదిమాత్రం వంకాయలబేరం కాదా. ఇంతకన్న నదే మెరుగు. చింత చచ్చినా పులుపు చావదు. మేము బి. యె. బియల్ ప్యాసైనాముకదా యని కోట్లు తగిలించుకుని, కోర్టులకు వెళ్ళగానే డబ్బు వస్తుందా. ఇంత యక్రి మవృత్తి మఱొక్కటి కానరాదు. పార్టీదగ్గరకుఁ జేరి వకాల్తునామా యిచ్చినాఁడంటే యిల్లు గుల్లచేసికొన్నాఁ డన్నమాటే. పాప మాగవర్నమెంటువారు ఫీజు లేర్పాటుఁ జేసినారు. ఏకేసైనాసరే ఎన్నివందలిచ్చెద వనే బేరం. అం

దువలననే యన్యాయార్జితములు నిలుచునా ? వారి విషయ మటుండ నే నీమాదిరిగా నొక్కొక్కనాఁడు పది, యిరవై, మున్పై సంపాదించినాను. మఱునాటికి నగల అయ్యవార్లం గారి నట్టిల్లే. ఇదంతా నాకెందులకు ? వాళ్లకర్మం వాళ్లది. నాకర్మం నాదీ. నాసొమ్ము నేను రాఁబట్టుకుంటాను. (అను చుఁ బోవును).

(ప్రదేశము—రాజబాట)

దా—ఏమయ్యో ! మాట మాట.

(తెరలో) ఎవ్వరు వారు నాయనా. నాకు భోజనమునకు వేళ యైనది. పోవలెను.

దా—ఆగండి. ఆగండి. వస్తున్నాను.

(అని పోవును.)

(తెర యెత్తఁబడును.)

దా—ఓహో ! పంతులుగారే. ఎవ్వరో యనుకున్నాను. ఎప్పుడూ రానివారు యీవేళ యీలాగు దయచేసినారేమి ?

వెం—కుశలప్రశ్నలకా నన్ను బిలిచినది?

దా—బాబూ! కాదండి. శ్రీధరుగారిగృహమునుండి వచ్చుచున్నా రేమో యని...

వెం—అయితే నేమి ?

దా—నన్ను మీరెఱుఁగరు కాని మిమ్ముల నే నెఱుఁగుదును. మీ యింటివద్ద బ్రాహ్మణార్థము చాలాసారులు చేసినాను. అందు వలన నే నీవీధినుండి వచ్చుచు, అనంతరావుగారి యింటినుండి బేరం కుదుఱక కాగితపుకట్టఁ జంకను బెట్టినట్లు తోచినది.

వెం—అవును! ఆయన కంగుడులేదు. కొంపలన్నీ దోచుకోవాలనే వారి యభిప్రాయము.

దా—దానికేమిలెండు. ఎవరికి వారికే యాయభిప్రాయముంటుంది.
మీరు వడ్డీలుపెంచి కొంపలు వేసుకుందామని చూడరా?

వెం—(కోపము నభినయించి పోబోవును.)

దా—కోపమురానక్కఱలేదు. చలోక్తికన్నాను. మీరన్నమాట సత్య
మే. కాని, అసలు జరిగినదేమిటి?

వెం—ఏమియున్నది? రెండువేలరూపాయిల నోటుబాకీకి రెండువం
దలు ఫీజు కావలయునట.

దా—మీరు పెద్దలు. కోపమువస్తే చెప్పలేనుకాని, పెద్దలు సంపా
దించిన కొంచెమైనా యుంటే యీచదువులకు తగులబెట్టి,
కాయకష్టములబడి చదువుకున్నారుకదా. మీకు తెలియని
దేమున్నది? ఏదో విధంగా పొట్టపోసికోవలెనా? లేదా? చె
ప్పండి. మీకేమి? మీరు జమీన్దారులు. మీలాటి యా
స్తులుంటే వారును మీవలెనే కూర్చుందురు. మీ రేమ
న్నారు?

వెం—ఒక వందరూపాయి లిస్తానన్నాను.

దా—అబ్బో! మీకు వారికి చాలా తేడాయున్నదే. నే నొక్క
మాట చెప్పుతాను. వింటారా?

వెం—ఏమిటది?

దా—ఈకోర్టులోనున్న ప్లీడర్లందరిలోను కొంచెము నోరెత్తి మా
ట్లాడగలవాడీయనే. ఈయన కోర్టులో బల్లలుగుద్దడ మె
ప్పుడు చూడలేదా? మునసబుగారు వీరి కేకలకు హడిలి
యెన్నికేసు లీయనపక్షము జేసినారు. మీరేదో తెలిసిన
వారని చెప్పవలసివచ్చినది కాని, నిజముగా నీయన కిది
యొక లెక్కయా? చాలమంది మీవలెనే తిరిగిపోతూ ఉం
టారు. ఏదో తునితగవు చేసికొందాము రండి. మనకు కేసు

నెగ్గడం ప్రాధాన్యముకాని, వందరూపాయిలు మనల రక్షించునా? ఇప్పుడు ఫీజీ యెక్కువని తెలివితక్కువప్లీడర్ని పెడితే మొదటికే మోసంకల్గుతుంది. హైకోర్టులకుంబోయి తిరిగి బాధపడవలెను.

వెం—నెగ్గించుట కేయనేమి భగవంతుండా?

దా—అదియా మీరు చెప్పేది. ప్రాణమేవిధమునైనను బోకుండ నాగవనిచెప్పి మందులు వేయనక్కఱలేదా? మనశక్తికొలంది మనము పాటుబడి పిదప దైవముమీద భారమువేయవలెను. ఓరుగాలిలో దీపమునెట్టి భగవంతుండా నీమహిమ యనడమా?

వెం—ఆయనవాద మెటులున్నా, మీవాదమెక్కువగా నున్నది. అయితే మీయుద్దేశ్య మేమిటి?

దా—మీరన్నదీ కాదు. ఆయన చెప్పినదీ కాదు ఇద్దఱకుంగల తేడాలో సగము.

వెం—అబ్బా! నూటయేబది రూపాయలే. దావాపోయినాసరే కాని, నేనంతసొమ్ము నియ్యను.

దా—అయితే వెళ్లండి.

వెం—(పోవుచుండును.)

దా—మాట మాట ఇంకొకపాతిక కట్టుకోండి.

వెం—పాతికలేదు. పరకాలేదు. నన్ను బోనివ్వండి.

దా—రండి వెళ్లుదాము.

వెం—మీ కాయనతోం బరిచయమున్నదా?

దా—మీకెంత పరిచయమున్నదో నాకును నంతేకలదు.

వెం—అయితే యాగొడవ మీకెందులకు?

దా—మీమేలుకోఱకే.

వెం.—నడుపుడు.

(దామోదరుఁడు దారితీయును.)

వెం.—ఈపేరిమంతా నాకొంటకే కాఁబోలును. ఈలాటివాజమ్మల నెంతమందిని జూచినానుకాను. నాకు వీడుతగవరా? వాడి డబ్బుకోసం వాఁడు ఏదో యిందులోవి పదిరూపాయిలు యిస్తానన్నాఁడు కాఁబోలును.

దా.—ఆగినాచే. రండి.

వెం.—నాయనా! ముసలివాఁడను. వస్తున్నా—

(అని యిరువురును నిష్క్రమింతురు.)

---

రెండవ రంగము.

(ప్రవేశము - అనంతరావు).

అ.—తుద కాబ్రాహ్మణుఁడు వచ్చునో, రాకుండునో, దురాశదుఃఖ మునకుఁ జేటను బుధులవాక్యము లనృతములగునా?

గీ. తొలుత దత్తుఁజేర వారిని దూలనాడి
　పోవ, నోర్చక వెనుకను బోరిపోరి
　ధనము లాగంగఁజూచెడు దారికన్న
　హీనమగు దెద్దియునులేదు యిలను జూడ.

ఎన్ని యకార్యము లొనర్చినను, నెన్ని నిందలకుఁ దలయొగ్గినను యీధనవ్యామోహము వలసనేకదా.

(ప్రవేశము - దామోదరుఁడు)

అ.—పండా? కాయా?

దా—పండే. కాని, నేను మొదటఁ జెప్పలేదుబాబూ. చంపుకు తిన్నాఁడు మీదర్శనమున కెవ్వరో వచ్చినారు ?

అ—ఎవ్వరు? లోపలకు రమ్మను.

(దా మోజరుఁడు నిష్క్రమించును.)

(ప్రవేశము - శ్రీరాములు.)

శ్రీ—(నమస్కార మొనరించును.)

అ—(అందుకొని) ఏగ్రామము మీది ?

శ్రీ—అయ్యా! మాది ఆర్యాపురము. నా పేరు శ్రీరాములందురు.

అ—పనియేమి ?

శ్రీ—తమదర్శనమునకే వచ్చినాను.

అ—ఎందుకయ్యా !

శ్రీ—స్కూలుఫయినలు ప్యాసైనాను. ఆంధ్రభాషయందును గొంచెము ప్రావీణ్యము కలదు. తమబోర్డులో ననేకమందికి యుపాధులు కల్పించుచున్నారు. నాకుఁగూడ నెక్కడనైనా స్కూలుమాష్టరుపోష్టు యిప్పించవలసినదని నాకోరిక.

అ—ప్రస్తుత మెచ్చటను ఖాళీలు కనుపింపవు. బోర్డులో నిదివరకు పనిచేసినవారికే పోష్టులు దొరుకుటలేదు. ఇదిగాక మాకు స్కూలుఫైనలువారగత్యములేదు. ముందెప్పుడైన ఖాళీలున్నప్పుడు చూచెదను.

శ్రీ—అయ్యా ! ఇదివరలో ననేకసారులు తమ దర్శనమునకుఁ వచ్చినాను. వచ్చినపుడెల్ల మరలరమ్మనుచుండిరి. ఇప్పుడు ఆ త్రియపురంలో రెండవ అశిష్టంటు సెలవుపెట్టినాఁడు. ఆపోష్టు దయచేయించగలందులకుఁ గోరుతాను.

అ—ఆపోష్టు యిదివఱకే యొకరికి ప్రామిస్ చేసినాము.

శ్రీ—అయ్యా! తన్ను దానుబాగపుకొనుట నిందయేకాని, మెలిమెంటరీ పాఠశాలలోఁ గొంతకాలము పనిచేసి, విద్యాభివృద్ధికిఁ దోడ్పడవలయునని కోరికతో వచ్చినాను.

అ—ఉండిన నుండవచ్చును. అందులకు మేమేమి చేయఁగలము? వెళ్ళండి. వెళ్ళండి.

శ్రీ—అయ్యా! బీదవాఁడిని.

అ—(విసుగుదలతో) ఏమిటయ్యా. అంతాబీదవాళ్ళే. అంతా తెలివైనవాళ్ళే. మాకు తెలివితేటలతోను, బీదతనముతోను నిమిత్తంలేదు. పిశాచంలాగ పట్టుకున్నావేమిటి! నీవెంత సేపున్నా లాభంలేదు. వెళ్ళు. వెళ్ళు.

శ్రీ—మీరు అధికారులు. యేమన్నా తగును. అధికారమదసంబున నెల్లరకును గనులు కానరావు.

(అని నిష్క్రమించును.)

అ—అకార్యముల గోడిగట్టిన నెదుటుగఁ దిట్టుచున్నను నోరెత్త వీలులేకుండును. ఎదుటుగఁ దిట్టువారు కొందఱు, దూరముగనుండి తిట్టువారు కొందఱు.

(ప్రవేశము - రామారావు)

రా—అయ్యా! నమస్కారము.

అ—(అందుకొనుచు) ఈనమస్కారములు పుచ్చుకోలేక చచ్చిపోతున్నాము. ఏయూరు?

రా—అయ్యా! మాది అత్రేయపురమండి,

అ—నీపేరు.

రా—రామారావండి.

అ—ఏరామారావు?

రా—ధరణీప్రగడ.

అ——సూర్యనారాయణగారి తాలూకు కాదా?

రా——చిత్తము. తమ కీయుత్తర మొసంగినారు.

(అని యిచ్చును.)

అ——(అందుకొని చదివి) నీకు వారికి సంబంధమేమి?

రా——ఆయన మామేనమామగారి పెత్తల్లి అన్నగారి మనుమలు.

అ——ఆలాగునా. సరే. ఆర్డరు పంపిస్తాను. వెళ్ళు.

రా——సెలవు తీసుకుంటాను. నమస్కారమండీ.

అ——ఊఁ.

(రామారావు నిష్క్రమించును.)

(తెర పడును.)

---

మూడవ రంగము.

---

(ప్రవేశము - శ్రీరాములు.)

శ్రీ——ఈయనకూడా యిందులకే వచ్చియుండవలెను. ఏదోయొక సిఫారసు తగిలినట్లు తోస్తుంది.

(ఒకవైపుఁ జూచి)

అదిగో! నవ్వుమోముగానే యున్నది.

(ప్రవేశము - రామారావు)

శ్రీ——మీరు వెళ్లినపని యేమైనది?

రా——డంకామీద దెబ్బఁ గొట్టిచేయించుకొన్నాను.

శ్రీ——మేష్టరీయేనా?

రా——మీరు కోరినపోస్టే.

శ్రీ——మీ కేదైనా సిఫార్సు యున్నదా?

రా—సిఫార్సులోను తిరుగని సిఫార్సు. అదే లేకపోతే మీరెంతో నేనుకూడా అంతే.

శ్రీ—తామెవ్వరి తాలూకు ?

రా—సూర్యనారాయణగారి తాలూకు.

శ్రీ—తాలూకాబోర్డు మెంబరుగారా ?

రా—అగును. నేను బోవలెను. జరూరు.

శ్రీ—వెళ్ళవచ్చును. మీరెంతవఱకు చదివినారు?

రా—మూడవతరగతి కంప్లీటుచేసినాను.

శ్రీ—అంటే థర్డుఫారమా?

రా—మీరన్నది నాకుఁ దెలియలేదు.

శ్రీ—ఇంగ్లీషులో మూడవఫారమా?

రా—కాదు. ఇంగ్లీషు చదివితేనా? మీరేమి చదివినారు.

శ్రీ—ఏమైతే నాయనా! నాకంటె మీరె మెఱుగు.

రా—నేను బోయెదను.

శ్రీ—చిత్తము.

(రామారావు నిష్క్రమించును.)

శ్రీ—ఈయన మూడవతరగతి కంప్లీటుచేసినాఁడట. ఆహా! ఏమి వ్యత్యాసము? ఇఁక వీరాపాఠశాలలకుఁ దయచేసి, యేమూఁడవతరగతికో విద్య నేర్పుదురు.

అక్కటా! దేశమున కెట్టిదురవస్థ జనించుచున్నది. చదువు సంధ్యలతో సగత్యము లేదఁట. అందువలననే ప్రాథమిక పాఠశాలల కిట్టిదురవస్థ సంభవించుచున్నది. కొలఁది వత్సరములకుఁ బూర్వమున్న విద్యాపాటవమునకును, నిప్పటి విద్యాపాటవమునకును నెంతయో వ్యత్యాసముకలదు.

"చింత చచ్చినను, బులుపు చావద"న్నట్లు తరగతుల పేర్లు మాత్రము మానకుండెను.

సీ. తరగతులనుగాంచి తాల్మినొందుటె కాని
లేశమైనను లేదు లేఖవ్రాత
పాఠ్య పుస్తకమ్ముల పెంచుచుండుటయె కాని
నోరువిప్పఁగఁ జాలువారె లేరు
పెద్ద తరగతులంచు పెద్దపేరులె కాని
అంకెల లెక్కింప నలవికాదు
పెక్కు పాఠములంచు పేరు జెప్పుటె కాని
చదువంగ నొకటియు సరిగరాదు

గీ. ఇట్టి పాఠశాలలఁ జేర నెట్టివిద్య
నేర్వనగునొక్కొ! బాలుర నేర్పుకూడ
రూపు మాపంగ నేర్పడె రూఢిగాను
పాప మేమిరొ యీగతి బట్టెకుడుప.

తొల్లిటివలె నాల్గవతరగతియం దుత్తీర్ణుఁడైన బాలుఁడు లోకవ్యవహారములఁ దెలిసికొన జాలకుంటయేకాక, కూలీల పద్దులనైన వ్రాయఁజాలకున్నాఁడు.

సీ. పద్దువ్రాయుమటన్న వచ్చెదననిచెప్పి
వెనుకంజవేసెడు వెట్టియొకఁడు
జాబునుజూపినఁ జదువంగఁ దీరిక
చాలదంచునుబల్కు చవటయొకఁడు
లెక్కగట్టుమటన్న లీలలఁ జూపుచు
మెల్లమెల్లగజారు మేటియొకఁడు
పొత్తములనుదెచ్చి ముందటఁబెట్టిన
వేళకాదనిచెప్పు వీరుఁడొకఁడు

గీ. కటకటా! యిట్టిపండితుల్ కలిగియుండ
దేశమాతకుఁ గఱవేమి? తెగులు గానియు
జీవములఁదాల్చి యుండుట చేటుకాదె
జీవయాత్రను జాలింప శ్రేయమగును.

వేదవేదాంగములును, పురాణేతిహాసంబులును నెందులకుఁ బుట్టఁబడినవి. ముం దెన్నఁడో పుడమినిఁ బుట్టు మూఢజనుల జ్ఞానులం జేయగదా ద్రొల్లిఁటిమహాముని లెన్నెన్నియో నీతుల గఱపఁ బొత్తము లనేకములను రచియించియుండిరి. అట్టి మహోత్కృష్టం బగు వృత్తాంతంబులఁ జదివియు, వినియు నెందఱెందఱు యిహలోకంబున వన్నెకెక్కి తుదకుఁ బుణ్యలోకంబుల నందఁజాలి యుండిరి ?

అక్కటా ! వర్తమానకాలమున నట్టిపదవులు లేకుంటయే కాక తా నెవ్వరో, యెందుల కీపుడమిని జననంబయ్యెనో, మనుజునకును, నితర జీవరాసులకును గలతారతమ్యమేమియో తెలిసికొన నేరని దురవస్థ యాంధ్రదేశీయులకు జనించుచున్నది కదా! భాషాజ్ఞాన మున్ననేతక్క పూర్వులవర్తనముల తెలిసికొనుటకుఁ దావు కలదా ?

ప్రస్తుత మీ ప్రాథమికపాఠశాలలో విద్యనేర్చి, తిరుగ నందే యుపాధ్యాయులుగఁ జేయుచున్న నిఁక నాంధ్రభాషాజ్ఞానమంతరించుటకు నాలుగైదువత్సరములుమాత్రమే చాలు నని నిస్సంశయముగ నుడువవచ్చును.

ఆంధ్రదేశము తొల్లిఁతలోకమందంతటను బ్రసిద్ధిఁగాంచుచు, విద్యలకు నెల్లఁ బుట్టినిల్లగునని పేరు వడసియుఁ, దుదకు భాషాజ్ఞానమే లేని పురుషులకుఁ బుట్టినిల్లయి, వైధవ్యము నందినస్త్రీ కైవడి, రూపుమాఱి యెట్లు భరింపజాలునో కదా.

ఓ కలియుగమా ! విద్వజ్జనవిధేయతగా మాదేశమున కిట్టి దురవస్థనుగూర్ప నేతెంచితివా ?

ఓ జననీ ! దేశమాతా !

గీ. సకలశాస్త్రంబులను నేర్వఁ జాలి సత్కీ
ర్తిసంపత్తి వడసియు భూరియశముఁ
గాంచియుంటియు మాతరో! కడకు నేఁడు
విద్యలేనట్టి సుతులను వెంటనంటి
యెట్లు భరియింపనెంచితో నెవ్వ రెఱుఁగు.

తల్లీ ! నీపుత్రులే నీకు శత్రువులై, సత్ప్రవర్తకులై యపాయమునకుఁ గూర్చుటకుమాఱి, వెంగలులై దుఃఖాకులచిత్తనుగ నొనర్చుచున్నారు. పరుల కసూయజనించిన జనింపవచ్చునేకాని, బిడ్డలకే తల్లియం దీర్ష్యజనించు టెంతటి యాశ్చర్యకరము ? నిరంతర సుఖదాయకంబును, నుత్కృష్టపదవుల కాకరంబును నగుమాతృదేవతాపూజ నొనర్చుటకు మారుగ, మాతృద్రోహ మాచరింపఁ జాల్పడుచున్నారుగదా. కట ! కటా! తాను దురదృష్టవశమున జరుగుచున్న, జరుగనున్న మార్పులనుగాంచి, చింతిలి, యెట్లో వానిని దప్పించుటకై యత్నింపకుంటయేగాక, సిగ్గుమనక, బుద్ధివిహీనత సంతోసమును వెలిఁబుచ్చనారంభించిరి.

ఆహా ! కాలమహిమ !

గీ. పాపశీలికి వెఱగందు వారలేరు
ద్రోహ మొనరింపవలె నని తోఁచె నకట!
తేనె లొలుకను బలుకుఁ దీపి నల్లి
పదవులే శాశ్వతం బంచుఁ బలుకుచుందురు.

ఓ భగవానుఁడా ! మా కిట్టిదుస్థితి నేలయొసంగితివి ? దేహమందు స్వస్థతకలిగి, భుజియింప నాహారమేయుండి యుంచుక

సౌఖ్యమబ్బెనా, కన్నులుగానరావు. అందున నీక నుద్యోగమేదైన లభియించెనా ?

గీ. పెంచుపెద్దగఁ జేసియు విద్యఁ గఱప
బుద్ధు లనుసెప్పి జనకుఁడే మూఢబుద్ధి
శత్రురీతిని గన్పట్టు మిత్రురీతి
నెట్టులొందునో మదినెన్న నెవరినసెసు ?
సరకుసేయఁగ నితరుల శక్యమగునె.

ఆమదాంధత నెత్తి కెక్కినతోడనే తన శక్తిసామర్థ్యత లేకపోయినను, నెదుటివా రెట్టిపూజార్హులైనను మదినెంచక, యధికారమదమునకే తావొసంగి, తృణీకరించు టెంతటి నైచ్యము ? ఎంచిచూడ నదిశాశ్వతసంపద కాదు కదా. అది వదలిన మఱునాఁటి యయ్యవారి యవస్థ లెటులుండునో, తలపోయకుండుటసరియే తోడివా రెంత చుల్కనగఁ జేసి పల్కుచుందురో గ్రహింపలేకుండు టెంతయు మూర్ఖత్వము కదా.

గీ. అంధునకు వెల్తురే విధి నమరియున్న
శంఖనాదంబు చెవిటికి సరసమున్న
అందమౌ స్త్రీ నపుంసకు గట్టియున్న
నెట్లు వ్యర్థంబొ యాకీర్తి నిలనుజూడ
విద్య లేనట్టివా డెందుదు వింతపశువు.

బుద్ధిమంతుఁ డెన్నఁడును న్యాయమును వీడఁ జాలఁడు. అధర్మములఁ బాల్గొనుట కతని కశక్యము. ఇతరుల బోధనలకు లోనుగాఁడు. అట్టి సద్గుణవంతుఁడగుటకు మూలాధారము విద్యయేకదా. విద్యయే లేకున్న స్వాతంత్ర్యమే లేకుండుటయేకాక, దుర్మార్గులవలనఁ దగుల్కొనుటయును గల్గును.

ఇంతయుఁ దర్కించిచూడ మునుపటివలెఁ బ్రయివేటుబడులు

వెలువడిననేకాని, ప్రారంభవిద్య యలవడుట కల్ల యనియే చెప్పవ
చ్చును. జీతము లిచ్చెడువా రొకరు. పరీక్షాధికారు లింకొకరు. నై
యొకరిపల్కుల నొకరు లెక్కింపబడకుండుటచే, నుపాధ్యాయులును
జాలమంది విద్యనేర్పినను, నేర్పకున్నను దమ వేతనములు తమకువచ్చు
నుగదా యని తమ విధికృత్యంబులఁ జాలమట్టునకు విడనాడుచున్నా
రు. యేపనిని చేయుట కయినను భయముకాని, భక్తికాని యుండ
వలెను. రెండును లేని-చో—ఆలోచనీయమే...

సీ. పెర్మనెంటుగఁబోస్టు భిన్నమే లేదని
 బడికి వేళకుఁ బోని పంతు లొకఁడు
చెప్పిన లేకున్న చేటు లేపించును
 ధ్యానంబు సలుపు నుపాధ్యాయుఁ డొకఁడు
వేతనంబులుమాకు విరివిగ లేవుగ
 నీచ మంచును బల్కు నీచ డొకఁడు
అధికారు లెన్నఁడు నరసి చూడరటంచు
 కునికిపాట్లను బడుచుండు నొకఁడు.

గీ. చెప్పఁజాలియు నీరీతిఁ జెప్పకుండఁ
గాల మెట్టులో కడపుచు మేలమాడు
వారు కొందఱుఁ జెప్పంగ నోపలేని
వారు పెక్కండ్రు యిట్టులఁ బలు గతులను
వెలుఁగుచున్నది ప్రారంభవిద్య గఱప.

ఓ భగవానుఁడా !

సీ. పాపముల్ తొలగించి ప్రారంభవిద్యకుఁ
 దోడ్పడ నెల్లరఁ దోలవయ్య !

ఓ దేశోద్ధారక[illegible] !

ప్రారంభవిద్యయే ప్రథమసోపానమా
నని బోధనల్ సల్పి యలరవయ్య

ఓ ప్రాథమికపాఠశాలోపాధ్యాయులారా !

అశ్రద్ధలను వీడి యాసలఁ బురిగొల్పి
ప్రారంభవిద్యకై పాటు పడరె?

ఓ విద్యాశాఖాధికారులారా !

ప్రారంభవిద్యకు భంగము లేకుండఁ
దగినట్టివిధులను దలఁచరయ్య

ఓ మహాజనులారా !

గీ.. ఇహపరంబుల కెల్లను నేది మూల
మగునో యట్టివిద్యను జూడ మక్కటకట!
లెంత లే లెండు విద్యకై లేదె హితము
పాటువడ నుండె దేశము పాటు వడరె.

(ప్రవేశము—సుబ్బయ్య.)

సు—ఓహో ! శ్రీరాములుగారా ! యెవ్వరో యనుకున్నాను. మీ కింత శోష యెందులకయ్యా ?

శ్రీ—అవును నాయనా ! కంఠశోషయే. మీ బడిలో నెన్ని తరగతు లున్నవి ?

సు—ఎన్నో కొన్నియున్నాయి. మీ రేమి జీతములనిచ్చి నిలఁబెట్టిరా ? ఆబోర్డువారు మాకెన్నఁడో ఋణపడియున్నారు. ఇప్పుడు తీర్చుకుంటున్నారు. మాయిష్టంమాది. అధికారులకే లే నప్పుడు శ్రద్ధ మా కుంటుందా.

శ్రీ—అయ్యా ? నాదొక్కమనవి. అధికారులు మిమ్మును జెప్పవద్దన్నారా ? మీ బిడ్డల మీరు బాగొనర్చుకొనుటయు నధికార గౌరవమేనా ?

సు—ఈలాటి వేదాంతములు వింటే యంతాబువ్వే. దేశోద్ధారకులు బయలు దేఱినారు. ఇచ్చేవి పదునెనిమిది రాళ్ళు. ఈ ప్రత్తాలికి చదువు చాలు.

శ్రీ—అయ్యా ! అసామ్యునకు హార్దించియే కదా మీ రంపుం బరివేశించిరి ?

శు—అయితే.

శ్రీ—అందుల కెవ్వరు మోడంబడినారో, యాంపని నెఱవేర్చుటయు విధికృతము.

సు—ఇదేమి నిర్బంధచట్టమా ?

శ్రీ—అయితే లెస్సగఁ జేయుదురు కాఁబోలును.

సు—అయిన నిప్పటి వేఱుగనుండవచ్చును.

శ్రీ—ఈయల్ప మనవేతన మువ్వురి పొట్టు తగియుండును ?

సు—చాలీను చాలకున్నను దప్పదు.

శ్రీ—సరియేకదా. అట్లు యిప్పాపమును నించుక వనమధ్యమాలోచించి, దెయునప్పుట శ్రీయోదాయకము గదా. బీదజీతమును నుండెడి సని, వనితలు భర్తల విడనాడుదురా ?

సు—పరిస్థితిమువూత్రి మూరకుంటిమా ? శోధించి గతవత్సరముకుఁ జెప్పుచునే యుంటిమి. ఈసంవత్సరము మా బడిలో నాల్గవతరగతి యందుఁ బదునైదుగురు సర్టిఫికెట్లను బొందియున్నారు.

శ్రీ—సర్టిఫికెట్ల కేమిభాగ్యం నాయనా.

సు—ఎంతమాట ! చదువుమాట యెటులున్నా సర్టిఫికెట్లంటూ యుంటే యేమేష్టరీయో సంపాదించుకొని పదిరాళ్ళు తెచ్చుకోవచ్చును. బాబూ ! నేనొక్కటిచెప్పెదను వినుఁడు. ఏదో కాలక్షేపము. మాస్కూళ్ళకు, యినస్పెక్టరువారు సంవత్సరమున కొకమాఱు వచ్చెదరు. వచ్చినప్పుడైనా, వారి రిమా

ర్కులంగాంచి మమ్ముల నడుగరు. ఒకవేళ వారు బాగున్న
దన్నా ప్రయోజనములేదు. జీతములిచ్చువారు తాలూకా
బోర్డువారు. పరీక్షలకు ఏరు. పరిశీలించువారికి స్కూళ్లను
దిగనుట కొరకనే కదా. ఆదియు మాహాత్మ్యమే. ఇంత
గోల ? చేసిన స్కూళ్ళలో నా దేరాజ్యము—

శ్రీ—అట్లనుట న్యాయమా? తల్లిదండ్రులు తమబాలుర సంరక్షణ
లకే కర్తలుకాని, మిగతవాని కన్నిటికిని బాలురకు మీ
రే యాధారులు. దేశమందు భాషాజ్ఞానము శూన్యమగునెడ
నందువలనఁ గల్గు నష్ట మనుభవించువారు మనపిల్లలుకారా?
ప్రాథమిక పాఠశాలలో పాధ్యాయు లందఱకును వందనీయు
లు. ఎన్నకెట్టి యున్నతపదవుల నధిష్ఠించినను నున్నతనమం
దార్జించు ప్రారంభవిద్య నాధారముఁ జేసికొనియేకదా.

సు—అగును. మీరనుచున్న నుడువు లన్నియు నిక్కములే. కాని,
యింక నీపాఠశాలలు బాగనుట కల్ల.

శ్రీ—వండుకొనుట కష్టమని యన్నమును తిన మానివేయుదురా?

సు—అన్నమునకును జదువునకును సాటియా?

శ్రీ—అగును. సాటికాదు. ఏమందునా?

గీ. శునకమాదిగ జంతువుల్ శుకపికాది
పక్షిజాలములు భక్షించి బ్రదుకవొక్కొ
తినిన లేకున్న నదియింత హీనికాదు
చదువు లేనట్టివానికిఁ జావెమేలు.

సు—చదువులేకున్నఁ జచ్చిపోవుచున్నారా?

శ్రీ—ఎట్టి యర్థమును గ్రహింపఁజాలితిరి? మృతజీవులు జీవన్మృతు
లని రెండు తెఱఁగులు.

సు—అంటే నాకర్థము తెలియదు.

శ్రీ—పంతులుగారూ! దీనికే యర్థము తెలియనిచో గురుత్వమేటు
ల నల్పుచున్నారు?

సు—బాగున్నది. అ, ఆ, ఇ చెప్పలేనా?

శ్రీ—ఎల్లకాలము అ ఆ లేనా?

సు—కాకపోతే నాకురానిది నేను జెప్పేదేమిటి?

శ్రీ—మంచివారండి. ఉన్న దున్నట్లు చెప్పినారు. అయితే చెప్పెదను వినండి. మృతజీవులనగాఁ జనిపోయినను బ్రతికియున్నను, అట్లె పరిగణింపఁబడుదురు. జీవన్మృతులనగాఁ బ్రతికియున్నను జచ్చినవారిలోనేజమ. విద్యరానివాఁడును రెండవనాకములోనే చేరును.

సు—బాబూ! మీరు చెప్పెడివన్నియు నాకును వచ్చినవి. ఈవిద్య యెట్లు బాగుపడునో చెప్పుదురు. ఏదో యీలాగున నలుగురు మొట్టలు పెట్టిన కొంతవఱకు దేలవచ్చును.

శ్రీ—మొట్టలా? ఏమన్నా అంటే మీకు మేష్టరీ యియ్యలేదా యని కొందఱు తుంటలు మొదలుపెట్టుదురు. మాగ్రామములోనే యీపదవి నాకు దయచేసిన తమ అగ్రహారికు లోఁబడు పద్ధతిని వేతన మక్కఱలేకయే చేయువాఁడనని యడిగినను, నేమి చెప్పుదును? యీసరికి జెంగిలవా గల్గా యిచ్చుటకుఁ దమ కాగ్లాలేవనియు, వేతన మిచ్చుటకుఁ దాపు లేవనియు తెలపిచ్చినారు. రేపు మాపులతోనే కాలము గడచిపోవుచున్నది. పిల్లలకుఁ జదువురాకపోయినా దేశమంతా గంగలోఁ గలిసినా వారిపదవులు వారిని వీడవుకదా. ఇంతకన్న నీబడులు గవర్నమెంటువారికిక్రింద నున్నప్పుడే లెస్సగ నుండెడివి.

సు—దీనికేమికాని, బాగుపడుటకు మార్గములెవ్వి?

శ్రీ—(1) శ్రీగవర్నమెంటువారు విద్యావిధానమును దగినంతమట్టుకు మార్పుఁ జేయుట. (2) పరీక్షాధికారుల యుద్దేశములతో స్థానిక స్వపరిపాలనా ధురంధరు లేకీభవించుట, (3) తాలూకాబోర్డువారు తగినంతవఱకు నుపాధ్యాయులకు వేతనముల వృద్ధిఁ జేయుట.

ముఖ్యముగ నీ మూఁడింటివలనను గొలఁదికాలములోనే ప్రారంభవిద్య యున్నతపదవుల నలంకరించునని నా యభిప్రాయము.

సు—సత్యము. సత్యము. ఏది యెటులున్న నాభోజనమునకు వేళ యైనది. పోవుదము రండు. అన్నట్లు మఱచినాను. ఉపాధ్యాయులు కొందఱు శక్తిగొలఁది పనిచేయుట లేదుకదా. వారిమాటయేమి ?

శ్రీ—దీనికిఁ బెద్దయాలోచ నెందులకు ? ఎప్పుడైతే తాలూకాబోర్డువారు పరీక్షాధికారులు యేకమగుదురో, యప్పుడే వారినడతలు బాగగును.

సు—పోదమా ?

శ్రీ—నడువుడు. (ఇరువురును నిష్క్రమింతురు.)

(తెర పడును.)

# పునస్సంధాన కల్యాణము

## పంచమాంకము

(ప్రవేశము — రాజభాట.)

(సెట్టులో)

ఫుట్టితి నీయిలన్ వగసె భూరియశంబునుగాంచఁ జొచ్చెనే
బుట్టగనేల? ప్రేమకిలఁ బుట్టినితా తలిదండ్రులే వడిన్
కట్టిడినంచు దూషణలఁగాల్చఁ దొడంగిరి భర్త-నీదు నే
నెట్టులఁ దాళుదున్ గఠిణపట్టదె? నీకును కావు మీశ్వరా!
(అని చదువుచు యోగినీ వేషంబున రుక్మిణి ప్రవేశించును)

రు.—అక్కటా! భగవన్మాయ నెఱుంగ నేరికి వశమగును? క్షణ
భంగురంబులగు నీయిహలోకసుఖంబులే శాశ్వతంబుగ నని
యెంచి యందేపడి మ్రగ్గుచున్న నదియేసుఖదాయకంబుగను
నిత్యమనియుఁ గన్పట్టును. అవస్థాభేదంబులఁ బట్టి విరక్తిమార్గ
సంచారులై యీప్రపంచకమే మిథ్యయనియు, నిందు జరు
గుచున్న విషయము లన్నియు ననిత్యములనియు భావనచేసి
తిమా తుద కదియే సౌఖ్యంబున కాటపట్టగును. (తన వేష
మును దిలకించి) అహా! నావేస మెంతలో మాఱిపోయి
నది. నిక్కముగ నేను మునుపటి రుక్మిణి నగుదునా?

సీ. సొమ్ముల ధరియించి చూడ్కుల నిగిడించి
యద్దంబునన్ జూచి యందమంటి

## పంచమాంకము.



ప్రతిదినముఁ గూడఁ బలుఁదోవ...

అలకములే దిద్దియు న...

మోమును గనుగుచు మోహమే యదియని

ప్రొట్ట చందమును తోడఁ బెట్టియుంటి

వన్నెలెన్నుచు మఱి నెన్నొన్ని వాంఛతోఁ

జీరెల, రవికెలఁ జేర్చియుంటి

గీ. అదియునప్పటి సంతోషమయ్యెఁ గాని

బొట్టువిరియంగఁ బోసియు గట్టఁ బట్టి

తాల్పఁ గాషాయవస్త్రముల్ దొరకెనయ్యె

పతి యెన్నఁడు లభ్యమో యెవ్వఁడెఱుఁగు.

అందువలననే కాఁబోలును, ఎప్పుడెవ్వరికెట్టి యవస్థలు సంభవించునో, యదియే విధికృతమని తలంచి నిర్విచారంబున ననుభవించుటయే కర్తవ్యమని బుధులు నుడివియున్నారు. కాని—

చ. చదివితిఁ బెక్కుశాస్త్రములఁ జాలగ నేర్చితి ధర్మమార్గముల్

చదివితినెన్నొ బోధనల సల్పెడు తొల్లిటి సచ్చరిత్రలన్

చదివితి సాధ్వవర్తనముఁ జాలుమనంబున నాచరింపగన్

చదువుల మూలమిట్టులయె సాధ్యమె పీడగఁ గర్మమూలముల్

ఎందుగాంచినను సతులకుఁ బతిశుశ్రూషయే యిహపరసాధన మని చెప్పఁబడియున్నది. అది లభ్యముకాక వ్యర్థురాలనైతిని గదా. అయ్యో! కాలమెంత దుర్ఘటమైనది. తొల్లిఁటి సీత, రుక్మిణి మొదలగు మహాసాధ్వీశిరోరత్నముల మదినెంచి యిహపరసాధన మగు భర్తృపాదారవిందసేవయే చేసి, వరలుదమని యెంతగ మది సంతసించితినో యంతకు వేయిమడుంగు, లెక్కుడుగ దుఃఖ మనుభవించు కాలము ఘటించెను గదా.

ఓ భగవానుఁడా! మాకు స్వాతంత్ర్యమే లేకుండఁజేసి తలిదండ్రులు తమ యిచ్చవచ్చిన పురుషులకుఁ గట్టఁబెట్టియుఁ బిదప నత్తవారు భార్యాభర్తలకుఁ బొందుఁగూర్పక యన్యాయముగ విపత్సముద్రంబుల ముంచివేయుటయుఁ గనులారఁ గాంచుచుండియు వారొనర్చిన తప్పిదంబులని యెడు శరంబులకు మమ్మెఱఁజేయు టెట్టి ధర్మమో, కనులారఁ గాంచుచును నూరకుండుట పాడియగునా?

గీ. దిక్కులేనట్టివారికి దిక్కునీవె
యనెడు బుధులవాక్యము కల్లయగునె యఱయ
నాథుఁ జేరఁగలేని యనాథలమగు
మాకు నేదారిఁ జూపెదో మసలనింక.

ఓ మగబిడ్డలను గని కట్నముల కాసించు మహానుభావులారా!

సీ. ధనము నార్జింపఁగఁదగు సాధనము మీకు
వనితల గొంతుకల్ పట్టికోయుటకె
ధనము నార్జింపఁగఁదగు సాధనము మీకు
భార్యభర్తల పొందు భంగపఱుప
ధనము నార్జింపఁగఁదగు సాధనము మీకు
కరుణ లేకుండఁ గొంపలనుగూల్ప
ధనము నార్జింపఁగఁదగు సాధనము మీకు
పెండ్లిండ్ల నెపమున బీల్చివేయ

గీ. ధర్మశాస్త్రంబులనియెడు దారిలేదు
పుణ్యపాపంబులనెయెడు బుద్ధిలేదె
నీచముచ్చు మనంగను నీతిలేదె
ఎవ్వరొసగిరి స్వాతంత్ర్యమిట్లు మీకు.

పురుషులమనియా మీకీ గర్వము?

గీ. పుట్టితిమి మేము మీవలెఁ బురుషులైన
అక్రమంబుల నెంచిన నధమమనక
న్యాయమన్యాయమనకను నడచుచున్న
లేఁడె భగవానుఁ డెందును రాఁడె నాఁడు.

ఈయిహమందు మీకు నీతులఁ గఱపువారు యున్నను, లేకున్నను, వారిపల్కులఁ జెవినిడక యదియే యాచారమని నిరంకుశాధికారములఁ గొనసాగించుచున్నను భగవంతుని మాత్రము మోసగింపఁజాలరు. ఇది మీకెంత శాశ్వతమో మాకును నంతేశాశ్వతము. భగవానున కందఱును సములే. వనితల నిట్టికారణముగ దుఃఖములపాలొనర్పు పురుషుల నియిల నుపేక్షింప సేయలే దని యెఱుంగుఁడు. నిష్కారణముగ మమ్ములను మమ్ములనుగన్న తలిదండ్రులను సుక్కఁజేయ, మీకుమాత్ర మెట్లు శాశ్వతసుఖంబు లలవడును? అయ్యో! ఈకట్టి పిశాచము లేనాఁడైనఁ గలదా?

(ఆలోచన నభినయించి) ఇట్లెన్నిరీతులఁ గుందుచున్నను నేమి ఫలము? నా యీయరణ్యరోదన మాలించువారెవ్వరు? ఏమైన నాపరమేశ్వరునిదే భారము. (కన్నులుమూసి చేతులు జోడించి) ఓ దీనవత్సలా! ఏను దొల్లి యెట్టి మహాపాతక మాచరించియున్నను నీప్రాయశ్చిత్తము చాలును. ఇఁకనైన నాప్రార్థన లాలించి నాయీయీప్సితార్థముల నెఱవేర్పుము.

ఉ. ఎయ్యది పుణ్యకార్యమగు యింతులకున్ సతతంబు మేదినిన్
ఎయ్యది మోక్షసాధనమొ యేవిధినాఱసి యెంచి చూచినన్
ఎయ్యది లేక యింతులిల నెందులకున్ గొఱకాకయుందురో
అయ్యది భర్తృసేవయగు నందగ జేయవె మ్రొక్కెదన్ సదా.

(అని నిష్క్రమించును.)

(తెరయెత్తఁబడును.)

(ప్రదేశము:—వేశ్యాగృహము)

(ప్రవేశము:—సుందరం)

సుం—(తలుపుఁదట్టుచు) మణిమాలా! మణిమాలా.

(తెరలో)

ఎవ్వరువారు?

సుం—ప్రతిదినమున వచ్చుచుండువాఁడే.

(తెరలో)

పలుకుల కేమి, చిలుకపలుకు లెన్నియైన పలుకవచ్చును. ఇప్పుడు తలుపుఁదీయుటకు వీలులేదు.

సుం—ఒక్కమాట.

(తెరలో)

మాటల కేమిభాగ్యం కుక్కతిరిగినట్లు తిరుగుచున్నావు నీ కేమి పనియున్నది. నీలాగే అందఱును తీసుకుబడినగాఁ గూర్చుండు న్నారను కున్నావు కాఁబోలును. చెవికోసిన మేఁక లాగున వచ్చినది లగాయతు అర్చేకదా. ఎన్నిమాటులు రావద్దని చెప్పినా బుద్ధిలేదు. ఛీ అంటే కుక్కకైనా సిగ్గుం డునుగాని నీకా సిగ్గులేదు.

(అని కసరుచు తలుపుఁదీసి యీవలకు వచ్చి)

మ—ఏమి దాఁచఁబెట్టినావు?

సుం—అయ్యయ్యో! ఇదేమిపాపము? తండ్రియార్జించిన ధనమంతా నీకేపెట్టినానుగదా. తుదకు నాయీదుర్గుణంబులఁ జూడలేక మంచముఁబట్టి గతించినాఁడు.

మ—మహాపోసి చచ్చినవానిలాగే! నీవుకూడ నాయనతోఁబాటు దయచేయలేకపోయినావా?

సుం—రామ. రామ. నీమూలమునగదా పుస్తికట్టిన పెండ్లామును నిప్పటివఱకును జూడలేదు.

మ—సరి. సరి. పైగా యిదొకటా. నీ తండ్రిలోభియై కార్యముఁ జేయకుండెనని యప్పుడేడ్చి, యిప్పుడు నా మూలమునా? పో. పో. ఇంకాకాంతనేపున్న నన్నే నిలబెట్టితివనెదవు. నీ విచ్చినదక్కె యింట్లో మూలుగుతోంది. నీవేదో మహాసెట్టి పోషిస్తావని లక్షాధికారు లెంతమంది వచ్చినను విడుచు కొన్నాను. సహ. సహ.

సుం—అయిన నీకింక నాగతియింతియేనా?

మ—గీ. ధనముకై కాదె మానంబు ధారవోసి
మిమ్ము మిమ్ములఁబట్టియు మెదుకుచుంటి
ధనము పోయినమాఱునాఁడు దలఁపనేల?
పొట్టకూటికిఁ జేటుసుఁ జెట్టఁబట్ట !

సుం—చెలీ! యింత యవినీతి సెల్లునా?

సీ॥ సరసంబులాడఁగ స్వర్గమంచును నెంచి
ఘనమంత దొంగిలి తార్చినాను
నిన్న నమ్మితినని నిక్కమేయనుచును
పాంసరికినోట్లకుఁ బరుగులిడితి
నిమిషంబుఁజూడక నిల్వఁగలేనన
హాసహంబునఁబొంగి మసలియుంటి
కరుణకై నిత్యముఁ గాచియున్నాననన
మేనుదెలియకుండ మెలఁగినాను

గీ. ధనమునశియించె మర్యాద తరిగిపోయె
కులసతిని బాసియుంటిని కొంపకూలె
కన్ను కానక తిరిగిన కారణమున
తండ్రిదివిఁజేరె కోర్కెలు దగ్ధమయ్యె.

మ—ఏ కోర్టులోనో రెండువేల యైదువందలు వచ్చునంటివి కాదా? అవియేమయ్యెను?

సుం—అయ్యో! దరిద్రుఁడు తలంటుకుఁ బ్రారంభించిన వడగండ్ల వానయట్లు. దావా కొట్టివేసినారు. పైగా బ్రతివాదులకర్చు లనిచ్చుకోవలసినదని తీర్పుఁ జెప్పినారు.

మ—కొంపయున్నది కాదా?

సుం—అదియు నా ఋణఖాతాలలోనే మునిఁగి యున్నది.

మ—అయిన నీకుఁజెప్పను గజ్జను బుచ్చుకొని బయలుదేఱుము. పొమ్ము. అవలకవనవసరము. లేకున్న గెంటించి వైతును.

(అని తలుపునుమూసి లోనికిఁ బోవును.)

సుం—అక్కటా! కులధనమంతయు బోసంగి వలయునెడ శాస్త్రాను సారముఁ బరిచర్యలఁ జేసి తుదకు నేఁ జింటునకుగు వెట్టుటకుఁ గూడ వీలులేక విధినుండియే వెనుకకుఁ దగల వలసిన యోగము కూడెనుగదా. కటకటా! యీ లంజకై యెన్ని యవమానకరములగు బనులనిచ్చలో నొనర్చితిని. ఇటులు రావలెనని కోర్కెగల్గిన వేళ...

సీ॥ రాజబాటనుబోక రాత్రికాలంబైన
సందుగొందులవెంట సాగినాను
తండ్రివాకిటనున్న తలుపుమెల్లగఁదీసి
కొల్లటి దారినిబట్టి మరలినాను
కోరుట తడవుగ కోరిక లన్నియు
సర్పించి ముదమంచు సలిపినాను
వలదంచు నీతులఁ బల్కెడువారల
దుర్మార్గులంచును దూరినాను.

గీ. కన్న తల్లియె దఱిఁజేరి కలుషమన్న
పలుకరాని దుర్భాషలఁ బలికినాను
తుదకు గతిలేక యీగతి నెదనునెంచి
దుఃఖములఁ జెందుచున్నాను దోసమంచు!

అదేమిశక్తియో కాని వలదని సీతులఁ జెప్పినారందఱు శత్రువర్గమే యయ్యెడినారు. తాగుబోతులు జూదరులు దగ్గర బంధువులైరి. సానులకొంపలఁ జేరిన సరసులెవ్వరు పనికివచ్చినారు? నాయీదుష్ప థంబులకెల్లను నాజనకుఁడేకర్త. ఏలయన...వయసువచ్చిన బాలను ధనాశచేఁ బుట్టినింటనునిచి కార్యమొనర్పకుండుటచే, మనోవ్యాధికి మందులేదను సామెతరీతి మన్మథాగ్నినిబడి మ్రగ్గుచుండఁ దుద కిట్టి దుర్బుద్ధిఁతోఁచెను. మా జనకునెన్ని రీతులు వలదని బోధించి నను బెడఁజెవిని బెట్టినేకాని లెక్కింపఁ డాయె. ధనమును గూర్పవలె నంచు దురాగతములకుఁ దావొసంగిన నేది యనుకూలమగును? ధనమంతయు నశించెను. అపకీర్తియూ ఘటించెను. ఆయార్జించిన ధన ముచేఁ దానా సుఖింపలేకపోయెను. దుర్వినియోగముఁజేసి నే యను భవింపఁ జాలనైతిని. నాయీ పాపదవాగ్ని నార్పనేది శరణ్యము?

(ఆలోచన నభినయించి)

ఎద్దియో యననేల? ఇంతదనుక, పాపభీతికి వెఱఁగందక యెవ్వారి నిడుమల ముంచితినో యా సతీతిలకమే నేఁడు నా దుఃఖము నార్ప గతియగును. ఆ వనితారత్నముయొక్క సేవయే యిహపరసాధనము.

అయ్యో! ఏరీతి నత్తవారిలుసేరు వాఁడ? ఎట్లాపె మోమును దిలకించువాఁడ? అత్తమామలకేమని ప్రత్యుత్తర మిచ్చువాఁడ? పెం డ్లియైనవెనుక నాజనకుని ధనమదాంధతచేఁ గొంతకాలమును నామ దాంధతచే, గొంతకాలమును నిర్బ్యలఁబూని నేఁటివఱకొక్కమాఱైన నఁ బోవనైతినిగదా! ఎట్లో మనమును గుదుఱు పఱచుకొని పోవుద

మన్నను వారాదరింతురో లేక యాదరింపకుందురో? ఆదరింపకున్న నింక గతియేమి?

(ఆలోచించి)

గీ. చేసియున్నట్టి పాపంబుఁ ద్రోసిపుచ్చ
పుణ్యస్థలములకుఁ బోవుచుఁ బుణ్యపురుష
సేవ సారెకుఁ జేయుచు నాత్మశుద్ధి
దైవచింతనఁ గడపెద దినము నాకు

(అనుచు లోనికిఁబోయి తిరుగ సన్యాసివేషంబున వచ్చి)

ఓ సర్వేశ్వరా!

ఉ. చేసితినెన్నియో విధులఁ జేయఁగరానివి దుష్టబుద్ధిచేఁ
జేసినవానినేడలఁపఁ జేయునదేమియొ తోఁచదక్కటా!
చేసిన పాపమేమొ తొలిఁ జేయని కెన్నఁడు దైవమా! యికన్
వాసముఁజేయుమయ్యమది భక్తినిగొల్చెద నీడ కెన్నఁడున్.

గీ॥ దుష్టవర్తనలివియని తోఁపనీదు
హైన్యవృత్తులె సద్వృత్తు లనఁగఁ బరఁగు
ఆత్మగౌరవమంతతో సంతరించు
లేనిదటుఁ జేయువానికి లేదు బ్రదుకు

ఉ. దోషమువాయఁ జౌరుషము సూచిగఁబోవును నిందనల్గుసం
తోషముదూరమౌను గడు దుర్భరమౌ ఘన కార్యముల్ వడిన్
వేషములెన్నియేనియిడ వేడుకపుట్టును మానహీనమౌ
దోషములన్ని చేరుఁ గడ దూషణలందగ డబ్బు లేమిచే

(అనుచు నిష్క్రమించును.)

(తెరపడును.)

## రెండవ రంగము

(మధురాపురమందలి రాజవీధి)

(ప్రవేశము:—రుక్మిణి)

రు—ఇదియే కదా మధురాపురము! దేశద్రిమ్మరినై యెండనక వాన యనక మార్గాయాసంబు భరింప నశక్యమైనను నోర్చి నేటికీ పురమును జేరనయ్యెను. ఎన్నికష్టములను భవించినను దుదకు నా కోరిక నెఱవేరుననియె డాసచే సన్ని యు సుఖదాయకంబులుగనె కన్పట్టుచుండెను.

దైవమా! ఇంతటితోనైన నాచింతల కంతరాయము గల్గు నట్లు ప్రసాదింపుము.

తండ్రీ! జగన్నాయకా!

ఉ. పుట్టినచాఁద సౌఖ్యమన పోల్కయె లేదుగ దోసమెట్టియో
గిట్టుట కల్గదో కొ! యిఁక కేవల మావిభుపూజకై నే
వట్టిదురాసలన్ దిరుగ భంగముచేసిన బాగొనర్చినన్
పట్టితి నీదుపాదములె భారము నీయదె సాధుభూషణా.

(అనుచుఁ బోవుచు మరల యాగి)

అయ్యో! ఇంతదనుక నున్న సంతోషము రానురానే కతంబుననో యంతరించుచుండెనే హేతువేమైయుండును? ఏ నెపమున నా యత్త వారిలు సేరఁబోదును? నీవెవ్వరవనిన నేమని ప్రత్యుత్తరమిచ్చుదాన? నాయత్తమామలు...

ఉ. ఎవ్వరిదాన వీవు కుల మెయ్యది? యిందును జెరనే కతం
బవ్వ? యనంగ నేమనుచు నందును నెయ్యది కాపురంబనన్
నెవ్విధమార్చి చెప్పగను యేనట్టఁ జాలుదా తోఁపదింతయున్
నవ్వులఁ జూపి పల్కులను నమ్మకయుండిన నేమి సేయుదున్

వారినెట్లో కప్పిపుచ్చుచున్నను నాప్రాణనాథుఁడే నాసేవల మన్నింపకున్న నీకేఁ దెలుపవేమి? అదియును సాధ్యముకాకున్న...

సీ॥ తొల్లిఁజేసినపాపపు దోసమనియుఁ
దప్పదంచును నెప్పుడు దథ్యమనియు
ననుభవించుచు దుఃఖము నాత్మ చేప
దేవు భక్తినిగొల్చుచుఁబోదు దివినిజేర.

ఒకవేళ నాప్రాణేశ్వరునిసేవ లభింపకపోవచ్చునేకాని

చ. కనుపడదే యిలన్వెదకగా నిసుమంతగరాళమున్ వడిన్
గనుపడదే యెటన్ గనగఁ గాలముఁదీర్చెడు నీటిపట్టులున్

ఇంతయేల?

అనలములేదె మృత్యువస నాయుధమెయ్యెడఁగానరాదె నా
మనమలరన్ యిదేవిధము మాధవువేడుఁచు భూమిఁబాసెదన్.

అనుచు నిష్క్రమించును.)

(తెర లేచును.)

(వెంకటేశ్వర్లుగారి గృహసమీపము)

(ప్రవేశము:—రుక్మిణి.)

రు:—వారుచెప్పిన నానవాళ్లన్నియు నీయింటియందే యున్నవి. (ఆశ్చర్యము నభినయించుచు) ఏమిది? యీగృహము పాడువడి నట్లున్నదే. కతంబేమైయుండును? వారలియుల్లిదయగునో, లేక మార్గముదప్పి వేఱొకవీధికి వచ్చియుంటినో? ఈచుట్టు ప్రక్కల నొక్కరును గానరాకున్నవారే. ఏమిసేయుదాన? ఏకతంబుననో, నామనము తత్తరపాటు నందుచున్నది. ఒక్కొక్కవేళ నపారంబగు సౌఖ్యముల పడనున్నవేళను, తత్తరపాటు కలుగవచ్చును. నాకట్టిభాగ్యమే నశించెనే. ఇంతయు నేడిదేమో పొడుప్పునకే సూచనమైయుండునోఫు.

హా! పరమేశ్వరా!

గీ. చెమ్మటల్ క్రిమ్మఁ దోడఁగొను జేరెఘోరి
దుఃఖమతిశయించెడురీతిఁ దోఁచుచుంటె
నిష్ఫలంబగునో శ్రీమ నీరజాక్ష!
భారమంతయు నీయదే పద్మనయన!

(ప్రవేశము.—రఘునాథము మార్గమునఁ బోవుచుండును)

రు—ఆర్యా! వెంకటేశ్వర్లుగారి గృహ మిదియేనా?)

ర—(తిరిగిచూచి) మీ దేయూరు?

రు—సన్యాసుల కొకగ్రామమనియుందునా?

ర—ఎందులకు?

రు—వారిదర్శనముఁ జేసిపోవలయునని—

ర—నీపల్కులు వింతగనున్నవే! ఆయనగతించి చాలకాలమైనది.

రు—(కన్నుల నీరుపెట్టును.)

ర—నీ కేలవిచారము?

రు—ఉపకారులు గతించిరనువార్తఁ జెవిసోకిన విచారముకాదా?

ర—అయిన నీవుధన్యురాలవే. ఆయనయెన్నఁడుఁ బిల్లికి బిచ్చముఁ బెట్టియెఱుంగని మహాపురుషులలో నగ్రగణ్యుఁడు. కాని, కష్ట పడి సంపాదించినాడు. ఏమిప్రయోజనము?

రు—(తత్తరపాటుతో) ఆర్యా! ఏమది? ఆయన కొకపుత్రుఁ డుండెనుగదా.

ర—ఉన్నను నిప్పుడు లేనివానిలోనే జమ.

రు—(తనలో) మానసమా! వేగిరింపకుము. శాంతమా! దక్షిఁజేరుము. (ప్రకాశముగా) నాయనా? అట్లనుచుంటిరేల?

ర—ఏమున్నదమ్మా. అయినఆస్తిఅంతా సానికిఁబెట్టి, చేతులఁగడుగు కొనియున్నాఁడు. అడిగినావుకనుకఁ జెప్పవలసివచ్చినది. ఈ

నడుమ నొకనాఁటిరాత్రి దానియింటికిఁ బోఁగా దుర్భా
షలాడి యావలకుఁ బొమ్మనెనఁట. అందువలన నాతఁ డూరు
వదలి వెడలెనఁట.

రు—హా! నాథా! (అని మూర్ఛమునుంగును.)

ర—(భీతితో) అయ్యో! యిదియేమి? నేనిఁటనున్న, నేదియో యా
మెను బాధించితినందురు.

(అని నిష్క్రమించును.)

(కొంతవడికి మెలకువగాంచి దుఃఖముతో) హా! దైవమా! నాకింకేమి
తెలుపు? నానాథునియందుఁజేరి, పరిచర్యలఁ జేసినయెడ సుఖం
బనుభవించుదానవని యువ్విళ్ళూరుచుండె నదియును సున్న
యయ్యెనే. అయ్యో! దురదృష్టవంతుల బాగుపడ్డవారు
కలరా?...

హా నాథా! మీకును నాయట్టి యదృష్టమే సంభవించెనా?
భర్తయని యొకనాఁడైనఁ గన్నుదెఱచి మిమ్ముల వీక్షించి
సంతసమందుభాగ్యమే లేకపోయెనుగదా. ఏరీతినైన మీరు
సుఖంబున నలరారుచుండఁ గాంచుచు, మీపాదారవిందసేవ
నొనర్చి, యిహపరసుఖంబందుద మనుకొంటినే. సానులిండ్ల
కుఁజేరు దుర్బుద్ధి మీకేల జనించెను? ఇంతయు జననీజనకుల
తప్పిదమేకదా. నేనుమీయందనుండి దినదినము ప్రార్థించు
చుండిన గొంతవఱకైన సద్బుద్ధిజనించి యుండునేమోకదా.
ఎంతగ ధనవంతులైనను దుదకుఁ దినుట కన్నముగూడ లేక
పోయెనుగదా. నాయున్న యిడుముల భరియించఁజాలక యెం
దేగితివి? ఏరీతి మిమ్ముల గలియుదాన? ఇట్టి దుఃఖాకుల
చిత్తనై, యెట్లోర్చుకొని యుండుదాన? ఈవరకట్నములేకదా
మనలనింతవఱకుఁ దెచ్చినది. మీరైన మీజనకునకు బోధిం
పఁజాలకుండిరా?

సీ. భర్తనువిడనాడి పడతులుండెదు తావు
యమలోకమునకైన యగునుగాదె
నిజనాథుఁ గోల్పోక నెలఁతలవర్తనల్
దుష్పథంబులకుఁ బోదుకాదె
పాతివ్రత్యసౌఖ్య భంగపడినచో
నోజగాకయుంటయో లోపకాదె
జీవితేశుఁగనక చేరి చేనినిదిన్న
గరళంబుపగిదిని గానరాదె

గీ. ఇంతమేలను పుడమియే హేయమగును
బ్రిదికియుండిన ఫలమేమి వరుని బాసి
జీవములఁదాల్చియుంటయే చేటుకాదె
కటకటా! యెట్లునిలువంగఁ గాంతకగును.

ఓమృత్యుదేవతా! ఇఁక నీవేశరణ్యము. అదృష్టదేవత నన్ను జిన్ననాఁటనే వీడిపోయెను. శాంతమా! నాదజేఁ జేరుము. ...

అయ్యో! ఇంకెక్కడిశాంతము. అన్నియు దుఃఖభాజనములేయయ్యెను. ఓ చిత్తమా! నీకోర్కెలన్నియు నిష్ఫలమైనవి. ఇఁక నైన ధైర్యావలంబనకు రాలప్రకమ్ము.

(దుఃఖముతో)

ఓప్రాణములారా! మీరు మీస్థలాంతరములకుఁ బొండు. ఓకట్న పిశాచమా! నీసాహసమును బూర్తిగ వెలిఁబుచ్చితివి. అట నాజననీజనకులకు—

సీ. కలసంపదలెల్లను కాఁజేసి క్షణములోఁ
నిసగించి లేకుండఁజేర్చినావు
కన్నబిడ్డనుగాంచి కలకాలమింటను
గుందుచుండెడు చింతఁజేకూర్చినావు

బందుగులెదుటను బడకుండ నిత్యము
తలవంపుఁగూర్చియు దరలినావు
కనుపునఁబుట్టిన గారాబమంతయు
విడిచిపించి యిచ్చతో వెలిగినావు
సీ. హేయమనిపించిపరాయి నింతింతజేసి
యప్రియముఁ జూపిసనుసాగ నంపినావు
ఇట్టిసుగుణాలరాసివే యెన్న నిన్నుఁ
జేర్చుటరయగ దక్కసిఁ జేర్చుటగును.

పోనీ, నీమూలమున ధనార్జనను జేసిన వారినైన బాగొనర్చితివా? అదియును లేదే. నామామగారు—

సీ. నీమూలమునగదా నీచముచ్చము లేక.
కొంపలఁగూల్చగఁ గోరినారు
నీమూలమునగదా నిర్లక్ష్యమునుజూపి
వసునిబంపకపట్టుఁ బట్టినారు
నీమూలమునగదా నీతిఁదప్పగఁ బుత్రుఁ
బెఱటిదారినిజూపి ప్రేరిల్చినారు
నీమూలమునగదా నిమిషమాత్రంబున
దగ్ధమై భువినుండి తరలినారు
గీ. ఉభయకక్షులవారిని నూడ్చివెనుక
సంతసంబుననుంటివే చాలుఁజాలు
శాపదగ్ధవుకావా? కా! చావులేదు?
ఆదరించిన జేరు దే! హాతమొనర్ప.

ఇన్నిరీతుల యత్నము సేయుట తుదకు మమ్ముల నిర్మూలమొనర్ప నేకదా. నీవీ కలికాలమందు కలిగీతవై జనులబాధింప బయలువెడలితివి కాఁబోలును. కానిమ్ము. నిన్ననసేల ?

గీ. రమ్ము రా రమ్మటంచును రగులఁజేసి
మూఢబుద్ధిని నినుఁజేరి మురియుచుండ
నీదు తప్పిదమిందును లేదులేదు
దూషణల్ సేయ మాదియే దోసమగును.

(ఆలోచన నభినయించి)

ఈతనిపల్కులు నిక్కములగునో, కాకుండునో? ఇంతటితోనే విరక్తిని జేసికొని ప్రాణములపైఁ టంత శ్రేయముకాదు. ఆవేశ్యా గృహమునకుఁగూడఁ బోయి సత్యమును గ్రహించి మఱియు ముందు యత్నము లాచరించెదనుగాక. దాని నెట్లు తెలిసికొన నగును? వారుసత్యమును దెల్పుదురా? అయినను బ్రయత్న మునుమాని ముందేజీవముల బాయుట యవినీతియగును. నోట నాలుకయుండ, గృహమును గనుఁగొనఁజాలకుందునా?

(అని నిష్క్రమించును.)

---

## మూడవరంగము.

---

(ప్రదేశము—వేశ్యాగృహసమీపము.)

(ప్రవేశము—రుక్మిణి.)

రు—ఈవీధిని దిలఁకించుటతోడనే, మోసమునకుఁ దావు, మోసము నకుఁ దావని మానసము బోధించుచున్నదే. ఏ రేకదా, కామమదాంధులగువారిని గులభ్రష్టులుగఁ జేయఁజాలెడు శక్తికలవారు. వీరేకదా యెట్టిధీరులనైన నిమిషమాత్రింబున దమమాయచే వశీకరణఁజేసికొనఁదగు సామర్థ్యముఁగలవారు. వీరేకదా క్షణకాలమున లక్షాధికారుల బిక్షాధికారులుగ

మార్పఁజాలువారు. ఏనెంతయవినీతిని. వీరిని నిందించు టేటి న్యాయము ? కామమదాంధులై యొడలెఱుంగక తమ యిం డ్లకు వచ్చినవెనుకఁగదా తమనటనలఁ జూపి వలలఁజిక్కఁజేసి కొనుట. మనపదార్థము మంచిదికాకున్న, కంసాలిని నిందింప నేల? తర్కవితర్కంబుల కదనుగాదు.

(ఒకవైపునకుఁ దిరిగి) అయ్యో ! మణిమాల గృహ మెచ్చట ?

(ఏమియోవినుట నభినయించి) ఏమి? యిదియేనా ? (సమీపించి ఎవ్వ రీలోపల ?

(తెరలో)

ఎవ్వరు వారు?

రు.—ఏనొక మార్గస్థురాలను.

(తెరలో)

పనియేమి ?

రు.—తలుపు నొకసారి తెఱువుఁడు.

(తలుపుఁదీసి శ్రీహరి ప్రవేశించును.)

శ్రీ—ఏవ్వూరమ్మా ! ఇదేంటి. పడుసుపిల్ల లీయేసమేంటి ?

రు.—దిక్కుమాలిన దానను.

శ్రీ—అదాకథ. దా. లోపలికిదా. సెట్టుమీద సిలకలాగున్నావు. మాఅమ్మాయికాసి, యీాబేరాలు నాకుఁదెలియవు.

రు.—(తనలో) ఏమిది ? ఈపెపల్కులు నాకర్థమగుటలేదే. బేరము లేమి ?

శ్రీ—ఏంటాలోచిత్తున్నావు ? కూకో మాఅమ్మాయిని కేకేత్తాను. అమ్మాయీా !

(తెరలో)

వస్తున్నానే. చీరెకట్టుకుంటున్నాను.

శ్రీ—(రుక్మిణితో) దిక్కులేనిదానవై తేమాత్రిం యీజేసురుసుడ్డ
        లెందుకు ?

రు—అనాధలకు శరణంబగు వ్రతమూనితిని.

శ్రీ—ఏంటమ్మా! అతమా ? ఏంపల్కులమ్మా. చిల్కపల్కులు.
        ఏంగతిపట్టిందేతల్లీ. ఇఁక చుఖపడుదుగానిలే.

రు—సుఖమా ! నాకుసుఖముపుట్టినాఁటనే వదలెను.

(ప్రవేశము—మణిమాల)

మ—ఏమమ్మా ? యెందులకు ?
        (రుక్మిణిని జూపి) యీపె యెవ్వరు ?

శ్రీ—ఈపిల్లకెవ్వరూ దిక్కులేరంటే లచ్మీదేవివలె మనయింటికాడి
        కొచ్చిందే. నీకు అప్పచెల్లెల్లు లేనందుక్కు యిది నీచెల్లెలనుకో.
(రుక్మిణితో) మాయింటికాడుండమ్మా. ఇం కిశారంమాను.

రు—(తనలో) వీరియుద్దేశ్యమేమియో నాకుబోధపడుటలేదు. తడ
        యుటకు సమయముకాదు.

(ప్రకాశముగా)

మీయాదరణకు సంతసమయ్యెను. ఏనొక కార్యార్థినై వచ్చి
        యున్నాను.

శ్రీ—కార్యార్థియా అంటేయేంటి ?

రు—ఒకపనికొఱకు వచ్చియున్నాను.

శ్రీ—మాకూ తెల్సిందిలే. నీనోటితో కూడా సెప్పు.

రు—మీరు సుందరంగారి నెఱుగుదురా ?

శ్రీ—ఏమోఅమ్మా! చుందరం యెవడో మాకు తెలియదు. ఆయనకు
        నీకు యేంచంబంధము?

రు—దాఁచనేల ? ఆయనయే నాభర్త. ఆయననుదర్శించి సేవఁజేయ
        వలయునని వచ్చియున్నాను.

శ్రీ—ఆలాగంటమ్మా. అప్పుడే యెర్రిపోయేడు. పాపం నీకూట్లో మూన్నే చేడు.

(మణిమాలతో)

చూచావంటే సుందరంపెళ్ళామంట. చిలకలాంటి పెళ్ళాని యిడిచి పెట్టాడు. ఈపాపమంతా ఆముచలోడిది. ఈడిజిమ్మడ. యేక డబ్బాశచే ఏంబావుకున్నాడు. యిలాంటోళ్లని యేడిపిత్తేనే, ఉన్నదికూడా యూడింది.

రు—సత్యమునుదెల్పి పుణ్యముఁ గట్టుకొనుఁడు. ఆయనదర్శనముకాని నాఁడు ప్రాణముల వీడుటకే నిశ్చయించుకుంటిని.

(ఒకరిమొగము లొకరు చూచుకొందురు.)

శ్రీ—మనకు భయమేంటే. ఏమౌత్తోంది. చంగతంతా చెప్పు.

మ—అమ్మా. ఆయన కొలఁదికాలముక్రిందటనే, ధన మీయలేదని మేము తిరస్కరించుటచే వెడలిపోయినారు. ఈయూరున మాత్రము లేరు.

రు—(కన్నులనీరునింపుచు) అయిన నేఁబోయెదను.

శ్రీ—ఏంటమ్మా మాయింట్లోయుండు. నీకేయుద్ధమైన లోటులేకుండా కాపాడేపూచీనాది.

రు—(వినకుండగనే నిష్క్రమించును.)

(తెరపడును.)

(ప్రవేశము:—సన్యాసివేషముతో సుందరం)

సుం—హా! ప్రాణేశ్వరీ! నిన్నన్యాయంబుగా నిడుమలపాలొనర్చిన నీ పాతకమున కెట్టిశిక్షవిధించి పుణ్యముఁగట్టుకొందునోకదా నాజనకుఁడెన్నఁడును గట్నమున కాసించి చేతులొగ్గెనో నాఁడే నేను నీయధీనమైతిని. నాఁటినుండియు నీవే నాకు యజమానురాలవు—

గీ. విక్రియఁబునకంచును వీధిఁబెట్టఁ
జగినధనమిచ్చికొనిరెను నీ తండ్రిరన్న
కాన నాఁటినుంశియుఁగూడ నేననీకు
దాస్యమొనరింపవలయును దప్పకుండ

ఇంతదనుక నీఋణమును దీర్పలేకున్నను నిఁక ముందైన ఋణవిము క్తునిగ నొనర్పవలసిన భారము నీయందే నిల్చియున్నది.

గీ. అతివయేయెందుఁ బురుషున కర్ధ దేహ
మంచు బుధులును శాస్త్రంబు లార్చుచుందు
సుదతివలననె యిహపర సుఖముకల్గు
అదియె కలునయ్యె పైగను సప్పుపడితి

---

(నాల్గవరంగము)

---

(ప్రదేశము:—ఒక దేవాలయము.)

(ప్రవేశము—సన్యాసి యగు సుందరం)

సుం—ఆహా! ఎట్టిమూర్ఖునకైనను విరక్తి కల్గినవేళ భగవదారాధన యే యిహపర సాధనమనితోఁచునుగదా. అందువలననే తొలుఁత సంసారాంధకారంబున మునింగిననే కాని యందుండెడు మమకారము నశించి మోక్షాభిలాష కలుగకుండునని గదా శాస్త్రంబులు ఘోషించుచున్నవి.

గీ. కలిమిచేఁ దులతూగెడు కాలమందు
పుణ్యపాపంబులనియెడు స్మరణరాదు
చావుపుట్టుకలనియెడు స్మరణలేదు
ధనముపోవున మఱునాఁడు తప్పకుండ
దైవపార్థనమేగతి ధాత్రి నెప్పుడు.

ధనమున్నంత కాలము బంధువర్గమన్న పరమఅసహ్యమగును. కావర మేయందు పరిశ్రమ కర్తవ్యము. నీచపరివర్తనలకే యుదితగిన నెలవు. ఆ దుష్టత్వముచే వ్యభిచారముఁ కుందా వొసంగిన—

చం. ధనము నశించు మానమును దప్పదు పిమ్మట కావరంబునన్
అనయమునిందలున్గలుగు యాదర మొందును గానరాదుగా
వినయము మాయకాకడ కు పీనులఁ బెట్టరుపల్కు లెవ్వరున్
అనువగు తావుకల్గదిఁక నంత్రమనందగు సాని జేరినన్

కడచిన దానికై కలఁత నొందుటకంటె నన్నిదుఃఖముల నంతమొందింపఁ దగు భగవన్నామస్మరణమే సుఖదాయకంబగును.

(అనికనులమూసి ధ్యానింప మొదలిడెను.)

(తెరలో)

రు—ఓపరమాత్మ స్వరూపా! ఆది మధ్యాంతరహితా! నిత్యానంద నిత్యస్వరూపా!

మ॥ అవసానంబున నన్ని చింతలను నాయాసంబునన్డించి యీ
భువిఁ దాఁజేసిన బాపసంగతుల నిర్మూలంబుగఁ ద్రోయగా
భవదీయాకృతి నెవ్వఁడెంచు మదిలో భక్తుండగున్ తద్విధిన్
యవలీలం లభియింప నీదయను సన్నాలింపవే మ్రొక్కెదన్

సుం—(కన్నులఁదెఱచి) ఈయార్తారవ మెవ్వరిదై యుండును? (నలువంకలఁ దిలఁకించి) ఈ చుట్టు పరిక్కలనెవ్వరును గానరాకున్నవారే.

రు—(తెరలో) ఓతండ్రీ! జగన్నాయకా! చిన్ననాఁటనుండియు...

గీ॥ సంతసంబున నెద్దియో సౌఖ్యమనగ
నెట్టులుండునో కనలేక యిడుమలంద
శల్యగతమయ్యెకాయము సానుభూతి.
నదియు విడనాడి నినుజేరఁ గదలుచుంటి

సుం.—(వినుట సభినయించి) ఎవ్వరో యొక యనాథయగు వనితా రత్నము జీవములఁ బాయ సిద్ధమగుచుండెను. తడసిన ప్రమాదము సంభవించును. పోయి సంరక్షించెదనుగాక !

(అని నిష్క్రమించును.)

(తెఱ యెత్తఁబడును,)

(రుక్మిణి మెడ కురితాడు దగిలించుకొని ప్రాణములు వాయ సిద్ధమగుచుండును.)

సుం.—(తత్తరముతో) ఆగుమాగుము. సాహసము వలదు. ఆత్మహత్య మహాపాతకము. (అని కేక లిడుచు వచ్చి యాత్రాటిని గోసివేయును.)

రు.—(నివ్వెరపడి చూచుచు) హా ! భగవానుఁడా ! ఇంకను నా కీయాపదలనుండి విముక్తియే లేదా ? "పాపీ చిరాయు" వన్నట్లు ప్రాణమున కంతముఁ గల్గించుకొందమన్న దీనికిని నంతరాయముఁ గల్పించితివే.

(సన్యాసికి నమస్కరించి)

ఆర్యా !

గీ. దుర్భరంబయ్యె కాయము దుర్గతులను
బ్రదికియున్నంత దుఃఖంబు ప్రబలముగను
దినదినాభివృద్ధిని జెంది దిగులుతోప
సిద్ధమైతిని బాయంగ జీవములను.

ఈపాపాత్మురాలి జీవముల కేల యడ్డు వచ్చెదరు ?

స.—తన్వీ ! కష్టసుఖము లందఱికి సమములే. కష్టకాలమందు విరక్తిమార్గ మలవడుట సహాజమే కాని యాత్మహత్యకుం బాల్గొనుట సెల్లునా ? అంతమాత్రమున పాపవిముక్తి కానేరదు. ఎవ్వరవీవు ?

రు—స్వామీ ! నాచరిత్రను వినిపించి శరణ్యు లగు మీకుఁగూఁడఁ
జింత కల్గించుట తగనిపని.

స—అట్లుకాదు. నాకోపినంతమట్టుకు సాహాయ్యముఁ జేయువాఁడ.
నీకీ వేసమున యుండవలసినంత యగత్య మెందులకు సంభ
వించెను ?

(తనలో) ఈమెను దిలకింప నేకతముననో యమితం బగుజాలి
దుఃఖము గలుగుచున్నయది. మా కిటువంటి కేదియో బం
ధుత్వ మున్నట్టుల మనమునం దాందోళనయు నంతకంత కతి
శయించుచున్నది. కారణ మేమై యుండునో కదా—

ప—అయ్యా ! భర్తృవియోగానలంబున మ్రగ్గుచున్న నాకిఁక
నిహలోకసుఖంబు లలవడునా ?

స—(తనలో) భర్తృవియోగమా ! ఒకవేళ నాసతి కాదుకదా?
అంతటిభాగ్యమా నాకు ? ఓ హృదయమా ! నీ కెందులకింత
యాతురత ?

(ప్రకాశముగా) కాంతారత్నమా ! భర్తృవియోగ మెం
దుల కబ్బెను ! నీయట్టి సుగుణాలవాలను విడిచిన యా మహాపా
తకుం డెవండు ?

రు—అయ్యా! నిష్కారణముగ నాయనను నిందింపనేల? నేనే యట్టి
మహాపాతకురాల నగుటంబట్టి నాకీయవస్థ సంభవించినది.

స—ఆహా ! ఏమి ? యీమె సుగుణత్వము. పతివ్రతల కుండఁదగు
లక్షణము లివియేకదా.

ఉ. దూరదు పీడెనంచు మది దోసము లెన్నదు పాపుఁడంచు వే
మారును దుఃఖమందుచును మానక చేసిన కర్మమెంచు నే
కారణ మింత తెల్ప దిటు కాంతలకెందును నోర్పుగల్గునే
ఘోరున నిట్టి దుర్దశలఁ బొందిన సుందరి గాంచనేర్చునే.

(పరితాపముగా) సుదతీ ! నాయెడ నొక్కటియు దాచక వెలిబుచ్చుము.

రు——ఏమని తెల్పుదాన ? ప్రాణదాత లగుటచేఁ జెప్పక తప్పినది కాదు. ఈదీనురాలిచరిత్ర నాలించుఁడు. నాజనని లా జన కుఁడు——

గీ. వలదు వలదంచు బలికిన భాగ్యమంచు
ఉన్నసంపద లర్పించి యొకని కీయఁ
గట్ట మింకెనుజాలక కడకు మాకు
వేఱుపఱచెను నన్నును విభునినుండి.

స——(తత్తరముతో తనలో) నాతలంపు లన్నియు నిక్కము లగు చుండెనే.

రు——రానురాను బుట్టినింటివాకిలిని సనహ్యముతోఁ

గీ. భర్తృశుశ్రూషయే నాకు భావ్యమనుచు
నెంచి వెదకుచుఁ బతియిలు వెదకిచూడ
(కన్నుల నీరు నింపుచు)
నాదురదృష్ట వశమున నాఘుడకట
ధనముఁనంతయుఁ బోఁగొట్టి తరలె నెటకొ.

స——(విచారముతో) సుదతీ! నీయత్తవారిదేయూరు ?

రుక్మి——మధురాపురము.

స——(కన్నుల నీరునింపుచుఁ దలవంచి యూరకుండును.)

రుక్మి——హా! నాధా! (అని యాతని పాదములపై వ్రాలెను.)

సుం——(లేవనెత్తి) తన్వీ! చింతింపనేల? ఏనును దుడకు నీవలెనే పడ రాని యిడుమలంబడి యిట్లు సన్యాసినై భగవదారాధనా నిమగ్నుఁడనై తిని. ఈపాపాత్ముఁ డిప్పుడు నీవెట్టిశిక్షవిధించిన ననుభవించుటకు సంసిద్ధుఁడై యున్నాఁడు.

సీ. పతి పాదసేవయే సతులకు సతతము
పరమపావనమను పడఁతిమిన్న
భర్తను విడినాడి బ్రితికియుండుటకన్న
మరణమే మేలను మాన్యచరిత
పాపినైననుగాని ప్రాణేశ్వరుఁడె తన
భాగ్యభోగములను భావనాత్మ
బంధుజనులఁబాసి మగని జేరఁగనెంచి
సంచరించెడునట్టి సదయహృదయ
గీ. కలిమి లేములు సమమను కలికి సకట!
ఆదరింపకవీడిన యధముపేని
యిచ్చవచ్చినరీతిని యిడుములందఁ
దగిన శిక్షనుజూపుమా తరుణి! యింక.

రుక్మి—నాథా! యిదియేమి? భర్తలను భార్యలు శిక్షింపవలెనా? ఇదియుఁగాక, యిందు మీతప్పిదమేమున్నది?

గీ. జనకు నాజ్ఞను జవదాటి సంచరింపఁ
బాప హేతువుకాదాకో! పరఁగనిట్లు
విధియనంగను స్పెల్లెదు వింతయేల?
నాదుపాపంబె యీగతి నన్నుఁజుట్టె.

సుం—తరుణీ! నాపుణ్యవశమున నేవిధముగనైన నిన్ను జూడఁ గంటిని.

రుక్మి—ప్రాణేశ్వరా! మీకు నాయందిట్టి యపారప్రేమ యుండుట వలననే నేను గడుధన్యురాలనైతినని యెంతయు సుఖ్యాంగు చున్నాను.

సుం—కాంతా! నీజననీజనకులు నిన్నెడఁ బాసియుంటచే నెంతగఁ గుందుచుండిరోకదా. వారిని వదలి, యీనిర్భాగ్యుని కొఱ

కేల యేతెంచితివి? ఇప్పుడైన నీవు వారికడనుండియే సుఖించుట శ్రేయోదాయకముగ నుండునని నాతలంపు.

రుక్మి—అయినఁ గావచ్చును గాని, మిమ్ములవీడి క్షణకాలమైన నిలువనోపను. ఇరువురముగూడ నిచ్చటనే భగవదారాధనల సలుపుచుఁ గాలమును బుచ్చుదము. ఏమందురా?

గీ. మీకు భగవదారాధన సోకు ముక్తి
భర్తసేవలఁజేయుట వలన నాకు
మోక్షసాధన మలవడు ముక్తికాంత
నిరువురము జేరవచ్చును నిందువలన.

సుం—బాగు! బాగు! అట్లనే యొనర్చుదము. ముందుగ మన మిప్పు డెయ్యది ప్రస్తుతకాలంబునఁ బ్రజలపాలిటి పెనుభూతమై దెగటార్చుచుండెనో, యెయ్యది సతిపతులు నిష్కారణముగ నెడఁబాప దుఃఖములందఁ జేయుచుండెనో, యెయ్యది క్షణకాలంబున లక్షాధికారుల భిక్షాధికారులుగఁ జేయుచుండెనో, యట్టి యీవరకట్నములబాధను దొలఁగింపను, నాంధ్రభాషామతల్లిని నుద్ధరింపను, భగవాను నొక్కమాఱు ప్రార్థించి పోవుదము.

రుక్మి—చిత్తము.

(ప్రదేశము—రామచంద్రరావుగారి గృహము.)

(ప్రవేశము—రామచంద్రరావు.)

రా.—కటకటా! రానురాను నిందలధికంబై మనంబునఁ గుదుఱులేక నిద్రాహారములకు దూరుఁడ నగుచుంటినిగదా. అయ్యో! యింకేమి తెఱువు? కులకాంత యెన్నివిధములఁ జెప్పినను వినదాయె. మిత్రులెంద ఱెన్నివిధములఁ బోరిడినను, వినక

యున్న సంపదయంతయు క్షణములోఁ బోఁగొట్టి యందున దుఃఖము మఱింత యధికంబై కాలుచున్నవాఁడను గదా. చూడఁజూడ నాముద్దులపట్టి రుక్మిణి, సుగుణాలంకారిణి, దిన దినము క్షీణించుచుఁ దుదకు శల్యావశిష్టయై యున్నది. ఏమి సేయువాఁడ?

గీ. కన్నమఱింపఁ జేసిన నాసుపేగు.
కట్న మీయక కార్యంబు కలుగదాయె
వెనుకఁ గొయ్యి ముందరనుయ్యి యనెడురీతి
బ్రాణసంకట మగుచుండె పాపమేమొ.

ఈయిడుములనందుచు జీవన్మృతుఁడనై యుండుటకన్నఁ బ్రాణము వీడుటయే సుఖదాయకమగునని తోఁచుచున్నయది. ముందువెనుక లారయక యాచరించుటచేఁగదా యిట్లు కుందవలసెను.

(ప్రవేశము—దుఃఖముతోఁ గృష్ణవేణి)

రా—(చేరఁదీసికొని) అమ్మా! యేడ్చుచుంటివేల?

కృ—అమ్మ యేడ్చుచున్నది.

రా—(ఆతురతతో) ఎందులకమ్మా?

కృ—అక్కయ్య యెక్కడికో వెళ్ళిపోయినది.

రా—ఎక్కడకు వెళ్ళునమ్మా. ఇరుగు పొరుగిండ్లకుఁ బోయియుం డెనేమో చూచితిరా?

కృ—అన్నియును వెదకితిమి. తుదకుఁ బరుపుక్రింద నీకాగితము దొరకినది. (అని యొకకాగితము నొసంగును.)

రా—(కొంతచదివి కన్నుల నీరుపెట్టును)

కృ—నేను జదివెద. (అని పుచ్చుకొని)

జననీజనకులకు; ప్రియపుత్రిక రుక్మిణి నమస్కారములు.

ఏ నీభువిని జననమందినదాదిగ, నన్నుఁ గనినందులకు మీకపార దుఃఖ మనుభవించుటయే యయ్యెను. నన్నుఁబోలు పాపిష్ఠురాలీ పృథమి వేఱొక్కతె యుండుననుట కల్లోనివార్త. నాసుఖముకొరకై తాము మీరుపడుచున్న సంపదలెల్ల ధారపోసినను దుడకుఁ జింతాక్రాంతులగుటయే కాని తత్ఫల మనుభవించుభాగ్యము నాకు లేకపోయెను. ఇట్టిదుఃఖ మనుభవించుచు జీవములఁ దాల్చియుండుట కన్న మరణమే శ్రేయోదాయకమని పొడగట్టుటచే లభించినఁ బతిశుశ్రూషఁగావించుచుఁ గాలమునుబుచ్చుదమనియు, లేకున్న... వ్రాయుటకుఁజేయి యాడకున్నయది. అందువలన నాకు భీతిజనించి కాదు. మిమ్ములఁ బరితాపమున ముంచుదునేమో యనియెడు సంశయమే. ఏను మీపాలిటికి రక్కసినిగాని, ముద్దులపట్టినిగాని విశ్వసించుడు. ఇదియే మీకిదువరకు కడసారివందనములు. కృష్ణవేణి నావలెఁగాక చిరంజీవినియై, సదా సుఖపరంపరల నోలలాడునుగాక. నాతప్పులమన్నింపుఁడు. ఇందువలన జననీజనకులైన మీకు సంతాపము కల్గించినదాన నగుదునని యెఱుంగుదును. కాని, నిత్యము మీకన్నుల యెదుటనుండి చింతను గల్పించుటకన్న నిదియే వేయి మడుంగు లెక్కుడు లెస్సయని యెంచి యిట్లొనర్చితిని. ఇంతటినుండి రుక్మిణి మీగర్భమున జనించియుండలే దనియే తలంచుడు.

ఇట్లు, రుక్మిణి.

రా—హా! పుత్రీ! (అని కొంతవరకు మాటాడనేరక) అయ్యో! ఎంత సాహసమొనర్చితివి? మాదుఃఖములకు నీవెట్లు కర్తవైతివి? నేమొనర్చిన పాపగర్మముల ఫలిత మనుభవించుచున్నాము. తల్లీ! ఆవిచారములకన్న నిది తక్కువ యని తలఁచితివా? నీకిఁక బతిశుశ్రూష యెట్లులభించును? కొంత యూరటఁబెందవలయు నని యిట్లు వ్రాసియుంటివి కాఁబోలును. నీసౌఖ్యమునకుకాదె మేమిన్నిపాట్లను బొందుట. అట్టి నీవు కటకటా! మాకడుపునఁ జిచ్చువెట్టి యేగు బెట్టెన్నాయ

ము ? ధనము పోయినందులకుఁ జింతిలుట లేదుకాని, నీకుఁ గాపురముఁ గూర్పఁజాలకుంటిమికదా యని సహస్రవిధంబుల పరితపించుచున్నారము. గోరుచుట్టుమీఁద రోఁకటిపో టనునట్లిక మాచింతలకు అంతరాయమే లేకుండెనా ! కటకటా ! ఇన్ని సంకటములకోర్చి యనిమియుండ శక్యమగునా ?

కృ—నాన్నగారూ ! అక్కయ్య నగలన్నియు నింటనే విడిచిపో యినది.

రా—ప్రాణముల వీడ సిద్ధముగ నున్నదానికి నగలెందులకమ్మా—

కృ—అయితే అక్కయ్య యిఁక నింటికిరాదా ?

రా—వచ్చునమ్మా. నిదురవకు.

(ప్రవేశము—దుఃఖముతో విశాలాక్షి.)

వి—హా ! నాథా ! మన కొంపకూలినది. (అని పాదములపై బడును)

రా—(విచారముతో లేవనెత్తి) ఏమిచేయుదము. పూర్వముఁ జేసిన పాపసం చయ మీగతిఁ గట్టికుడుపుచుండెను. వలదని యెన్నిరీతులఁ దెల్పినను వినకుంటివికదా. మనమా దరిద్రులమైతిమి. దానికా సౌఖ్యమున్నది లేకపోయెను. మన నారాయణరావున కిచ్చి పెండ్లిఁజేసిన నింత పుట్టిమునుఁగక పోవునుగదా.

వి—అయ్యో ! నాథా ! ఈదుఃఖమెట్లు భరింపగలను ? కన్నపుత్రిని చేతులారఁ జంపుకొంటిమే. మనవంటి దురదృష్టవంతు లెందైన నుందురా ?

రా—తన్వీ ! జరిగినదానిఁ గూర్చి యెంతగ దుఃఖించినను నిష్ప్రయోజనము. దీని కంతకును కారణభూతుఁడను నేనే. పోయి వెదకెదను. పతిశిశ్రూషయనెను. మనల నూరడింపఁ జేయుట కిట్లు వ్రాసియుండెనేమో—

వి—ఇంకెక్కడి పతి ? ఎక్కడి శిశ్రూష ?

రా—రాత్రి రెండుజాములు మీఱినవేళ నేనావిలికిఁ బోవునప్పుడు ప్రక్కమీఁదనే పరుండియుండఁ గాంచితిని.

పంచమాంకము.

నేఁటి సాయంకాలము గదిలోఁగూర్చుండి యేమియో
యుచు నన్నుఁజూచి యాకాంక్షితమును బయలుపఱిందఁ జ
వైచినది. అదేమని యడుగ నేమియు లేదనియె.

—నిన్నటినుండియు నీప్రయత్నము కూడనే యుండెనుగాఁబో
ను. ప్రతిదినమున నేను గచ్చేరినుండి వచ్చునరికి నెదుట
నేతెంచి పలుకరించెడిది. నిన్న నట్లు వచ్చియుండలేదు
ఏమో యనుకొంటిని.

వి—నిన్నటినుండియేకాదు. ఈనడుమఁ బదిదినములనుండి యొం
టిగఁ గూర్చుండి ప్రతిదినమున నేదియో యాలోచించుచు
యుండెడిది. ఆ ఆలోచనలన్నియుఁ దుదకు మన గొంతుకఁ
గోయుటకేయయ్యెను. ఇన్నివింతలు జరుగుటకే కాఁబోలును
తొలుతనుండియు నన్నియు శుభసూచకములే.

రా—చూచితివా! భాగ్యవంతులు భాగ్యవంతులని పరుగులిడి తే
పిల్లఁగూడఁ దక్కకుండఁబోయెను. ఒకవేళ బ్రతికియున్నను
దిండిలేక యెక్కడ మాడుచుండెనో! మనకుఁ దగిన ప్రాయ
శ్చిత్తమైనది.

వి—కటకటా! ఈనిష్ఠురములేల? కన్నపుత్రికి దుర్గతులఁ గల్పించి
న పాపి నగుటవలనఁగదా—

సీ. బంధుగు లండఱు నిందఁబుచ్చుదురంచు
వరకట్న మీయంగవలయునంటి
తోడివారలలోన దోషంబులేకుండఁ
జేయంగవలెనని చేరమంటి
కట్నమీయకయున్న గార్యంబెకాదని
మందబుద్ధిని నిట్లు మసలుకొంటి
కన్నపుత్రికి సౌఖ్యమన్న నిదేయని
ముందువెనుకలేక మోసపోతి

గీ. బంధుగులు లేరు ధనమెల్ల మంటఁగలిపు
సౌఖ్యమునకుమాఱు పుత్రికిఁ జావుకలై

పునస్సంధాన శుల్కము.

మంచిచెడ్డల నెఱయని మనుజులెల్లఁ
జెంటనిశ్చయు మిారీతిఁ జేసెదరుగాంచు.

వి.—సఖ ! ఈనీతులు తెలుతనేయున్న మనకిన్ని పాట్లు కే
డవుకదా.

సీ. భాగ్యవంతులటంచుఁ భావించితిని
భావింపఁగాలేమ [illegible]
తనయకు సుఖమంచు తలఁచి[illegible]
తలఁపనై తివికా[illegible]గమంచు
కట్నమిచ్చించుట గౌరవమని[illegible]
కాంచగాలేమ [illegible]
మిత్రులందఱికిని సుగుల సొంప[illegible]
యెంచలేదయ్యెయో [illegible]

గీ. ముందువెనుక లారయకుంట మోసమయ్యె
ధనము నశియింప మర్యాద తరిగిపోయె
కష్టకుఁ బుత్రియు సౌఖ్యంబుఁ గాంచలేక
జీవములఁ బాయఁబోయెను చింతఁబుచ్చి.

వి.—అయ్యో ! ఏమిచేయుమనెదవు? కర్మమునునుసరించి బుద్ధిపోవును

గీ. తొల్లిఁ జేసిన దుష్కృతదోషమున్న
సుగుణమెట్లుల సమకూడుఁ జూచుచుండఁ
జెడుగునే మంచిగామార్చి చేర్చిచెప్పి
తలనుబట్టియు సేడ్చేదే తప్పుతోవ.

—ఒకవేళ నత్తవారింటికిఁ బోయియుండెనేమో వెదుకఁ బ
[illegible]వ్వరును నిష్క్రమితురు.)

(తెర పడును.)

సంపూర్ణము

[illegible]రంజని ముద్రాక్షరశాల, రాజమండ్రి.